# మనవి



రైతు భూమినీ, పశువుల్నీ ఎంతగానో ప్రేమిస్తాడు. వాటికోసం ప్రాణాన్ని సహితం త్యజించడానికి సిద్ధపడతాడు. ఆ వాస్తవాన్ని యీ నాటకంలో నిరూపించడానికి కృషి చేశాను. అంతేగాదు. చారెడు భూమికోసం వ్యవసాయ కూలీలు పడే తహతహనుగూడ పాఠకులదృష్టికి, ప్రేక్షకులదృష్టికి తీసుకురావడానికి ప్రయత్నించాను.

ఈ కృషిలో తమ అమూల్యమైన సలహాలను, సూచనలను యిచ్చి తోడ్పడిన శ్రీ పొల్లూరి సుబ్బారావు (కృష్ణాజిల్లా ప్రజా నాట్యమండలి ఆర్గనైజరు) గారికి, తదితర మిత్రులకు నా నమస్కృతులు.

అడిగిన వెంటనే నా యీ నాటకాన్ని చదివి 'ప్రస్తావన' వ్రాసి యిచ్చిన శ్రీ శ్రీనివాస చక్రవర్తి గారికి, ప్రచురించిన 'శ్రీ విశాలాంధ్ర ప్రచురణాలయం' వారికి నా హృదయపూర్వక అభివందనాలు.

ఈ నాటకం ప్రజలకు ఏమాత్రం ఉపకరించినా నా కృషి ఫలించినదని తలుస్తాను.

— రచయిత.

# ప్రస్తావన



తరతరాలుగా ధనిక భూస్వాముల ఇనప పాదాలకింద బడి నలిగిపోతూ "భుక్తికోసం, భూమికోసం" లక్షలాది బీద రైతుకూలీ ప్రజానీకం చేస్తున్న పోరాటానికి రూపకల్పనే 'భూమికోసం' అనే ఈ నాటకం. ఈ రూపకల్పన చేసింది శ్రీ సుంకర. రసవత్తరమైన బుర్రకథలద్వారా, మాభూమి లాంటి ఉత్తమ నాటకాలద్వారా శ్రీ సుంకర ముక్కోటి ఆంధ్రులకు చిరపరిచితులే.

"భూమికోసం"లో రెండువర్గాలమధ్య సంఘర్షణ చిత్రితమైంది. భుక్తికోసం చెమటోడ్చే బీద ప్రజల కష్టార్జితాన్ని నిలువునా దోపిడిచేసే ధనికభూస్వామివర్గం ఒకటి. ఇంతకొండ, జత ఎద్దులూ ఉంటే చాలుననుకుని కష్టించి జీవిస్తూ, ధనిక భూస్వామివర్గ దోపిడికి అమాయకంగా గురయే బీదప్రజానీకం రెండోవర్గం. మొదటివర్గానికి ప్రతినిధి "నక్కను చంపి పుట్టిన" గోపాలరావు. పేద రైతు భూమికోసం, భుక్తికోసం పడే తాపత్రయాన్ని ఆసరా చేసుకుని, అతని మనస్తత్వంమీద సూటిగా దెబ్బకొట్టనేర్చిన జిత్తులమారి. రెండోవర్గానికి ప్రతినిధి "కుడుం యిస్తే పండగనుకునే" బక్కరైతు చంద్రయ్య. ఎద్దులన్నా పొలమన్నా ఇతనికి ప్రాణం. "కావాలంటే నా ప్రాణం యిస్తా, వాటినిమాత్రం యియ్యను" అని ధనిక భూస్వామికి ఎదురు నిల్చిన ధీరుడు. ఈ ఇద్దరికీ వచ్చిన ఘర్షణే నాటకంలో ప్రధానాంగం. కూలి సమస్య, బంజరు సమస్య దీనికి ఉపాంగాలై గోపాలరావు అన్యాయాన్నీ, దురాగతాన్నీ

బట్టబయలు చేస్తూ ప్రధానాంగానికి బలం చేకూర్చుతున్నాయి. ఈ రెండువర్గాల సంఘర్షణా పూలలో దారంలా వ్యాపించి నాటకానికి రూపం చేకూరుస్తోంది. గోపాలరావు అన్యాయాలు, దౌర్జన్యాలు, చంద్రయ్య ఎడ్లని, పొలాన్ని మింగేయడంతో పరాకాష్ఠకు చేరతాయి. ఇక్కడే కథ పరమావధికి (Climax) చేరుకుంటుంది. చంద్రయ్యకు పిచ్చి ఎత్తడంతో ప్రజలలో సానుభూతి కలుగుతుంది. నలుగురం ఐక్యం కాకపోతే గోపాల రావు మరంతాలకు అంతుఃడదనేభావం ప్రజలలో మొల కెత్తుతుంది. ఈ బీదవర్గానికి బలం చేకూరి, ధనికభూస్వామి వర్గానికి బలం సన్నగిలుతుంది. కాలువకు ఎగువన అడ్డకట్ట వేయించడంతో మధ్యతరగతి ప్రజానీకం తమ నెత్తిమీదకే వచ్చేసరికి బీద ప్రజలతో కలిసిపోయి ధనికభూస్వామిని ఎదిరించి విజయం చేపట్టుతారు. అయితే ఈ విజయంతో సంఘర్షణ పూర్తి అయిందా ? లేదు. అసలు వాస్తవిక జగత్తులోనే ఈ సంఘర్షణ పూర్తికాలేదు. అందుకనే రచయిత ఈ విషయం నాటకాంతంలో సూచించి వదలివేశారు. ఈ సంఘర్షణా దృక్కోణంలో చూస్తే ఈ నాటకంలోని విశిష్టత గోచరిస్తుంది.

ఈ నాటకానికి రంగస్థలం ఒక పల్లెటూరు. గ్రామీణ ప్రజాజీవితం ఇందులో యథార్థంగా ప్రతిబింబిస్తోంది. ఈ నాటకం చదువుతూన్నంతసేపూ ఏదో పల్లెటూరులో నివశిస్తున్నా మనే పాఠకులకు అనిపిస్తుంది. సామాన్యంగా ప్రతి గ్రామం లోనూ మనకు కనిపించే వివిధ మన స్తత్వాల ప్రజలూ ఇందులో కనిపిస్తారు. నక్కజిత్తుల గోపాలరావు, భూమికోసం, ఎడ్లకోసం ప్రాణమర్పించే అమాయక రైతు చంద్రయ్య,

వ్యంగ్యంగా మాట్లాడే సూరయ్యా, 'ఊఁ' అంటే చెయి చేసు కునే బండరాముడు, డబ్బుకీ ప్రాణానికీ లంకె వేసుకుని డబ్బుకూ, తన ఆత్మీయులకూ దూరమైన రంగయ్యా, నెత్తిమీదికి వస్తేనే గాని కదలిక లేని జానయ్యా, నిజాయితీకోసం నిలబడే పుల్లయ్యా, శాస్త్ర రాజకీయానుభవమున్న మోహనరావు ఇలాగే రక రకాల వ్యక్తులు మన కీ నాటకంలో తారసిల్లుతారు. అన్ని పాత్రలలోకీ తలమానికం కనకమ్మ. మాట కట్టె విరిచి పొయిలో పెట్టినట్లున్నా మనసుమాత్రం వెన్నముద్ద. పిల్లలంటే ఆమె కున్న ప్రేమ, అతిథులమీద చూపే గౌరవాతిశయాలు, ఎవరినీ లెక్క-చేయని ఆమె వ్యక్తిత్వం పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తాయి. నాటకం చదువుతుంటే ఈ పాత్రలన్నీ మన కళ్ళముందర నిలిచి తమ తమ గాథల్ని వినిపిస్తున్నట్టుంటుంది. ఈ పాత్రల సంభాషణలలో, చేష్టలలో ఎంతో యథార్థత, ఎంతో జీవం గోచరిస్తుంది.

సంభాషణలు కమ్మోచ్చున తీసిన తీగలాగా చకచకా సాగిపోతూ ఎంతో రమణీయంగా ఉంటాయి. రంగస్థలంమీద ఏదో ఒక విధమైన చలనం, అనుమేషం పొడగట్టి నాటకమంతా చలనచిత్రంలా నడిచిపోతుంది.

ఇక నాటకాని కంతటికీ ఆయువుపట్టు వచ్చేత్తిన చంద్రయ్య "పాదుగొట్టింది నేను, దున్నింది నేను, మొక్క-నాటింది నేను, నీరు పోసింది నేను, పెంచింది నేను, పెద్ద చేసింది నేను, నాదా! నీదా! తోట. నాదా, నీదా?" అని నిలవదీసి అడిగే ఘట్టం. "నాదా, నీదా?" అని అడుగు తూన్నది ఒక్క- చంద్రయ్యేగాదు. లక్షలాది ప్రజానీకం.

ఈమాటలు ప్రతి పతిత హృదయంలోనూ మారుమ్రోగుతాయి. మారుమ్రోగడమేగాదు, జానయ్యలాగా "జాను బాబు" అని మనచేతకూడా జవాబు చెప్పిస్తాయి. ఒక పేదరైతు హృదయం ఇంత చిన్న చిన్న మాటలలో పొదగడం సామాన్య శిల్పికి అలవైనపని కాదు. "ప్రజలు మేలుకున్నారు. మీ కుట్రలూ, కుతంత్రాలూ బయట పడిపోతున్నాయి. ఇది మీ రెంత తొందరగా గ్రహిస్తే అంతమంచిది" అనేమాటలే జానయ్యతో పాటు "జాను బాబు" అని అంగీకరించ నిరాకరించే ధనిక భూస్వామివర్గానికి ఈ నాటకం ఇచ్చే తుది హెచ్చరిక.

అదిగో తెలుగుతల్లికి నివాళి. అవిగో "భుక్తికోసం, భూమికోసం" చెమటోడ్చే కష్టజీవుల ఛాయాచిత్రాలు. చూడండి. ఏవో పాడుతున్నాయి చెవియొగ్గి వినండి.

—శ్రీనివాస చక్రవర్తి.

4-1-1955.



# పాత్రలు

1. చంద్రయ్య - వయస్సు : 50
   వలసవచ్చిన పేదరైతు. కష్టజీవి.

2. నారయ్య - వయస్సు : 40
   చంద్రయ్య తాత, ఇతని తాత అన్నదమ్ములు. వున్న ఆస్తి పోయి వ్యవసాయకూలీగా మారాడు. వ్యంగ్యంగా మాట్లాడుతాడు.

3. రంగయ్య - వయస్సు : 40
   ధనకాంక్ష మెండు, అవకాశవాది.

4. మోహనరావు - వయస్సు : 20
   అభ్యుదయ భావాలుగల యువకుడు. చదువుకున్నవాడు. శంకరయ్య కుమారుడు.

5. గోపాలరావు - వయస్సు : 40
   భూస్వామి - మెత్తని కత్తి.

6. శంకరయ్య - వయస్సు : 45
   ధనిక రైతు. గోపాలరావుకి వంతపాడుతూ వుంటాడు. నీళ్ళు నములుతూ మాట్లాడుతాడు.

7. జానయ్య - వయస్సు : 36
   మధ్యతరగతి రైతు. మొదట భూస్వామికి అనుకూలుడుగా వుండి, క్రమంగా ప్రజల వైపుకు మొగ్గుతాడు.

8. రామదాసు - వయస్సు : 50
వ్యవసాయకూలీ. కాచి వడపోసిన వ్యక్తి. ముందు వెనుకలు ఆలోచించి మాట్లాడుతాడు.

9. పుల్లయ్య - వయస్సు : 30
వ్యవసాయకూలి. ముక్కుసూటిగా మాట్లాడుతాడు.

10. రాముడు - వయస్సు : 35
గోపాలరావు నౌకరు, రౌడీ.

11. కనకమ్మ - వయస్సు : 34
సూరయ్య భార్య. పెళుసుగా మాట్లాడుతుంది. కాని మంచి మనసు.

12. నిర్మల - వయస్సు : 16
చంద్రయ్య కుమార్తె, గుణవంతురాలు.

13. సరోజ - వయస్సు : 10
గంగయ్య కుమార్తె, ముద్దైన పిల్ల.

14. కోర్టు అమీనా, మరొక రౌడీకూడా వుంటారు.



[ నేపథ్యం ] పాట

తెనుగుతల్లీ కల్పవల్లీ
దివ్యసుమ ఫలదాయినీ ॥ తెనుగు॥
ఒడలినిండా ప్రకృతిసంపద
కడుపునిండా ఖనిజసంపద
కలిగి వర్థిలు కన్నతల్లీ
వందనా లివిగో సుజాతా
అందుకోవమ్మా !
అందుకోవమ్మా ! !
అందుకోవమ్మా ! ! !

ఛాయా నాటిక

పురుషులు :

పర్వతాల బారులు
పరుగులెత్తే వాగులు
నీలి నీలి మబ్బులు
నీలాల మబ్బులు
బారులు తీరిచి పోయే
పక్షుల కలకలధ్వనులు
మెల్లగా
పిల్లగాలి వీచెనోయి చల్లగా ॥ఓ॥

స్త్రీ లు :

కూలీరైతుల మేల్కొల్పుటకై
బాలసూర్యు డుదయించాడు
అదె – బాలసూర్యు డుదయించాడు ॥కూలీ॥
అరుణారుణ కాంతులు యింటింటికి
అందజేయుచున్నాడు ॥కూలీ॥

పు రు షు లు :

బంగారుభూములు
పచ్చన్ని పైరులు
అందమైనతోటలు
పల్లెపడుచు పాటలు

స్త్రీ లు :

కారుచీకటులు తొలిగి జగానికి
కాంతిరేఖ లగుపించాయి
శాంతిస్థాపనకు యీవెలుతురులో
సాగిరం డిదే జనులంత ॥ఆ...ఆ...॥

[ పాట ననుసరించి చూపించే ఛాయలలో వలసవచ్చే చంద్రయ్య, నిర్మల పొలంలో కూలీలతో కలిసి పనిచేస్తున్న సూరయ్యను కలుసుకుంటూరు ]



# భూమి కోసం

## ఒకటో రంగం

సమయం : 12 గంటలు — సూరయ్య ఇల్లు

[ అది పూరిల్లు. మంచం ఒకటి గోడకు ఆనించివుంటుంది. దాని ప్రక్కన చిన్న స్టూలొకటుంటుంది. ఇంటి యజమానురాలు కనకమ్మ వాకిలి కెదురుగా కూర్చుని పాతపంచె కుడుతూ ఉంటుంది. వయస్సు 34 సం. సాదా చీరె, జాకెట్టు; నగలు లేవు.

రంగయ్య వస్తాడు. వయస్సు 40 సం॥ చొక్కా, పైన వుత్తరీయం, కాళ్ళకు సాదా చెప్పులు, బట్టతల, చేతిలో కర్ర ]

రంగ : అమ్మాయ్, కనకమ్మా! మీ ఆయనున్నాడా?

కనక : (కుడుతూనే) లేడు.

రంగ : ఎక్కడ కెళ్ళాడో?

కనక : నాకు చెపుతాడా యేంటి? నేనుంటమే ఆయనకి పీడగా వుంటేను.

రంగ : ఏమన్నావ్! పీడా! అసలు నువ్వులేకపోతే సూరయ్య బతగ్గలడా అని.

కనక : అయ్యో! నుంచున్నావేం రంగయ్యన్నా! (లేచి మంచం వాలుస్తూ) కూచో.

రంగ : (కూచ్చుంటూ) కూర్చోడానికేంలే. ఏవిఁటమ్మా విషయం. నాతో చెప్పగూడదా?

కనక : నీతో జెప్పడాని కేంగాని ......

రంగ : ఇన్నాళ్ళనుంచి యిరుగు పొరుగున అన్నా చెల్లెల్లాగా వుంటున్నాం ...

కనక : ఏం జెప్పను రంగయ్యన్నా ! ఎంతజేసినా తిట్లు, చీవాట్లు.

రంగ : ఏఁవిటీ ! సూరయ్య నిన్ను తిట్టాడా ?

కనక : ఆఁ. పైకి మూసిపెట్టుకోటమేగాని మొగుడిచేత చెప్పు దెబ్బలూ, చీవాట్లూ తినని ఆడ దెవరంట.

రంగ : అవున్లే.

కనక : ఇంతకీ వచ్చిన పనేంటి రంగయ్యన్నా ?

రంగ : మరేం లేదు. నాలుగుబళ్ళ యెరువుంటే, సూరయ్య తోలిపెడతానన్నాడూ......

కనక : అట్టాగా. నీకు మాటిచ్చి సావుకారు గోపాలరావు యెరువు తోలటానికి పోయాడేం, ఎగురుకుంటూ ? ఇట్టా వుంటయ్, చేసే పనులన్నీ. నే గనుక్కుంటాలే రంగయ్యన్నా.

రంగ : రేపా ఎరువు తోలకపోతే చాలా యిబ్బంది సుమా ! మర్చిపోకుండా చెప్పమ్మా.

కనక : ఆఁ ... చెపితే మాత్రం, మా మాట లింటారా యేం మీా మగాళ్లు. (మూతివిరచి లోనికి పోబోతుంది. ఇంతలో సూరయ్య దగ్గా, పశువును రిక్కవేసి అపుతున్న ధ్వనీ వినబడుతుంది. కనకమ్మ, రంగయ్యలు అటు తొంగిచూస్తారు.)

రంగ : ఎక్కడిదో గిత్తదూడను తోలుకొచ్చాడే ! ...... చుట్టాలు కనకమ్మా ! చుట్టాలు ......

కనక : చుట్టాల కేం కరువు ! (లోనికి వెళుతుంది.)

[సూరయ్య వస్తాడు. బనీను, తలగుడ్డ, భుజాన పలుగు. నిర్మల అతని వెనుక వస్తుంది. వయస్సు 16 సం. ఎండదెబ్బ తగిలి ముఖం వాడిపోయింది. మాసిన ముదురురంగుచీర. వే రొక రంగు జాకెట్టు, రేగిన తల, వాలుజడ.]

సూర : (పలుగు మూలపెట్టి, తలగుడ్డ దులుపుకుంటూ) రా అమ్మా ! (వింగులోకి చూస్తూ) ఇదిగో ! చంద్రయ్యన్నా ! గిత్తదూడను ఆ గుంజకట్టెయ్ !

రంగ : ఎవరు సూరయ్యా ?

సూర : బందుగులు.

(ఇంతలో కనకమ్మ రెండు చెంబులతో నీళ్లు తెచ్చి అక్కడ పెడుతుంది)

సూర : (నిర్మలతో) దొడ్లోకెళ్లి కాళ్లూ చేతులూ కడుక్కో అమ్మా! (కనకమ్మతో) తీసుకుపోవే !

కనక : ఎవరూ ?

సూర : మన అమ్మాయే – నువ్వెరగవులే.

కనక : సడె; ఎరుగుండి అడుగుతారా యేంటి ? రా అమ్మా !

(ఒకచెంబు తీసుకొని నిర్మలతో లోనికి వెళుతుంది.)

(చంద్రయ్య వస్తాడు. చేతిలో పచ్చగడ్డిమూట, కర్ర, మాసినబట్టలూ గడ్డం, కాళ్ళకు పాతచెప్పులు. కర్ర గోడకానించి, మూట అక్కడ దించి, పచ్చగడ్డి తీస్తూ వుంటాడు.)

సూర : (అటు చూస్తూ) ఏంటది చంద్రయ్యన్నా ?

చంద్ర : మరేంలేదు, నాలుగు పచ్చపరకలు.

సూర : కోడెదూడకా ?

చంద్ర : అవును బాబూ ! లేకపోతే వుసూరుమనదు, నోరులేని సన్నాసి.

రంగ : అందుకే రైతుకు బిడ్డమీదకంటె, గొడ్డుమీదే ప్రేమెక్కువంటారు.

చంద్ర : కాదుమరి, లేచినదగ్గరనుంచి మనబతుకంతా దాని మీదేగా... (ఉన్నదానిలో సగం పచ్చగడ్డి తీసుకొని బయటకు వెళతాడు).

రంగ : ఇంతకూ, ఈయన దేవ్వూరు ?

సూర : పడమట, మల్లారం...

రంగ : ఒహో! ఆ వూళ్లో మీకు బంధువు లుండాలేమో ? మీ నాయన అంటూవుండేవాడు.

సూర : అవును, మా తాత, ఈయన తాత సయాన అన్నదమ్ములు.

రంగ : సరె, సరె, ఈయనెప్పుడూ మీ ఇంటికి వచ్చినట్లు లేదు. అందుకని అడిగాను.

సూర : మొదట్లో రాకపోకలు బాగానేవుండేయి. కాని ఆయేటి కాయేడు తగ్గిపోయినై. మా తరంలో అసలే లేకుండా పోయినై. మళ్లీ నే...టి...కి.

(దూడకు మేతవేసి, చంద్రయ్య వస్తాడు. సూరయ్య ఆయనకు చెంబు అందించుతాడు. ఆయన దానిని అందుకొని, బయటకు వెళతాడు.)

రంగ : సరేగాని, ఆ పిల్లెవరు ?

సూర : (చంద్రయ్య వెళ్ళినవైపు సైగచేస్తూ) కూతురు.

రంగ : నేనూ అంతే అనుకున్నాను.

(కాళ్ళూ, చేతులు శుభ్రంచేసుకొని చంద్రయ్య వస్తాడు. సూరయ్య అక్కడవున్న పాతపంచె ఆయనకు అందించాడు. దానితో చంద్రయ్య ముఖం తుడుచుకుంటాడు.)

సూర : (మంచం చూపుతూ) కూర్చో అన్నయ్యా!

రంగ : దయచేయండి (ఒకప్రక్కకు జరుగుతాడు.)

(ఇంతలో సరోజ వస్తుంది. వయస్సు 10 సం. పరికిణీ, జాకెట్టు ధరించింది. చెవులకు లోలకులు, జడకుచ్చులు, చేతులకు రెండు జతలు బంగారు గాజులు.)

రంగ : (సరోజతో) ఏఁవిటమ్మా ?

సరో : నీకోసంకాదు నాన్నా. అత్తయ్యెందుకో పిలిచింది.

రంగ : ఒహో !

చంద్ర : అమ్మాయా ?

రంగ : అవునండీ.

సూర : పిల్లంటే పిల్లగాదు. సిసింద్రీ అన్నయ్యా !

రంగ : ఆఁ ! దాని మొఖం – ఏమండీ చంద్రయ్యగారూ ! ఈ సంవత్సరం మీ ప్రాంతం పండ లేదటగా ?

చంద్ర : అసలు యిత్తనాలే పడలా. ఎన్నడూ ఎరగం ఇంత కరువు.

రంగ : పాపం !

సూర : కూడుమాట దేవుడెరుగు. తాగటానికి గుక్కెడునీళ్లు కూడా దొరకటంల్లేదంట. ఇం కేం బతుకుతారు !

చంద్ర : ఒక టే బతుకు. ఎక్కడ చూచినా కాకులు, గెద్దలు, రాంబందులు......

రంగ : అబ్బ ! అట్లాంటిచోట మనుషులు కాపురం వుండేదెట్లా?

చంద్ర : ఎవరుండా రక్కడ ? తల్లికి పిల్లా లేదు; పిల్లకు తల్లీ లేదు. మొగుడు దారి మొగుడు, పెళ్లాం దారి పెళ్లాం.

సూర: పొట్ట చేత్తోపట్టుకుని పోతా పోతా దారిలో పడి చచ్చేవాళ్లు చస్తావుంటే, వూపిరుండవాళ్లు ఆ శవాల మీదుగా నడచిపోతన్నారంట.

రంగ: ఎంతఘోరం! అందుకనే యీమధ్య మంత్రిగారొకరు చూడ్డానికి వెళ్లారక్కడికి.

సూర: ఏ మంత్రిగారూ?

చంద్ర: కరువు మంత్రిగారు. వచ్చారు, వెళ్లారు.

రంగ: ఆయన కిదంతా చూపించి, మీ కష్టసుఖాలు చెప్పకోలా?

సూర. అసలాయన దర్శనం అయిందో లేదో.

చంద్ర: పోతా, పోతా ఒక మీటింగుపెట్టి చెప్పదలచుకున్న మూడు ముక్కలూ చెప్పేవెళ్లాడు.

రంగ: చెప్పారుగదా! ఏంజెప్పారు?

చంద్ర: ఏదో చెప్పారు, పోనిద్దుదు.

సూర: అదేంటన్నయ్యా, తప్పేముంది? చెప్పు.

చంద్ర: మా వూళ్లల్లో పాపంపెరిగి కరువచ్చిందంట.

సూర: అదీ సంగతి! సరె. తరవాత.

చంద్ర: చచ్చిన జనం చావగా, మిగిలినాళ్లు పిల్లల్ని గనటం మానుకోవాలంట.

సూర: భేషుగ్గావుంది, ఈసలా. ఆఁ. ఆమూడో ముక్కేంటి?

చంద్ర: ఏముందీ; తెల్లబియ్యం పాటిమానిక. అయినదానికీ, కానిదానికీ పెభుత్వంమీద ఆధారపడటం అంత మంచిది కాదంట, అందుకని ఎవరికాళ్ళమీద ఆళ్ళని నుంచోటం నేర్చుకోమన్నారు.

సూర : కడుపు నిండిపోయింది. బలే ముక్కలు ! మూడూ మూడు వజ్రపుతునకలు. విన్నావుగా రంగయబావా.

రంగ : (విసుగ్గా) పోనియ్యావోయ్, గొడవ. ఆయనగా రేం జెప్పాడో ఈయనగా రేం విన్నాడో.

సూర : (వ్యంగ్యంగా) అంతేలే. అంతే. (నవ్వుతాడు.)

రంగ : సరేగాని, చంద్రయ్యగారూ ! ఇంతకూ మీరు సురక్షితంగా, కుటుంబంతో సహా బయటపడ్డట్టేనా ? అక్కడ భూవసతి ఏమైనా వుందా ?

(కనకమ్మ, నిర్మల, సరోజలు వస్తారు)

చంద్ర : (నిట్టూర్చి) కుటుంబం ! భూవసతి !

రంగ : ఏం, అట్లా అంటారేం ?

సూర : ఏం జెప్పమంటావ్ రంగయబావా ? ఆస్తి అప్పులాళ్లు కాజేశారు. అమ్మవారు మా వదిన్నీ, ఆమె కొడుకునీ మింగింది.

రంగ : శివ ! శివ ! ! విన్నావా, కనకమ్మా ?

కనక : ఆc. ఇన్నా. అదంతా ఈపిల్ల జెప్తావుంటే కడుపు తరుక్కుపోయింది రంగయ్యన్నా !

(సరోజ బయటికి వెడుతూ వుంటుంది.)

రంగ : ఏమో పాపం ! ఇక నీపిల్లకి నీవే తల్లివి. (నిర్మలతో) నీ పేరేcవిటమ్మా ?

సరో : నిర్మల నాన్నా !

సూర : ఉండు సరోజా వెళతావేc ?

సరో : ఇప్పుడే వస్తా మాఁవయ్యా.

కనక : తొందరగా రా అమ్మా.

(సరోజ వెళుతుంది).

సూర : ఇదిగో; ముందు అమ్మాయికి రెండు మెతుకులు, పెట్టు; ఎప్పుడు తిందో యేమో.

నిర్మ : నేను రాత్రి తిన్నాన్లే బాబాయి. (తండ్రివైపు దీనంగా చూస్తుంది; చంద్రయ్యకూడా కుమార్తెవైపు విచారంగా చూస్తాడు. వారిద్దరి చూపులు కలుస్తాయి.)

సూర : (ఆ దృశ్యాన్ని చూచి జాలిగా) అన్నయ్య రాత్రికూడా తినలేదన్నమాట.

కనక : అట్టాగా, అన్నికూడా తెమ్మను. (నిర్మలతో) పదమ్మా! (నిర్మలను లోనికి తీసుకొని వెళుతుంది)

రంగ : చంద్రయ్యగారూ! లెండి మీరుకూడ.

చంద్ర : (గద్గద కంఠంతో) లేవటాని కేంగాని, నా బిడ్డకి......

సూర : అన్నయ్యా ఏంటిది ? కష్టాలు మనుషులకిగాక మాఁకుల కొస్తయ్యా. ముందు లే. (రెక్క పట్టుకుంటాడు.)

చంద్ర : (పొరలివచ్చే దుఃఖాన్ని అణచుకుంటూ) అదిగాదు బాబూ!

సూర : తరవాత మాట్లాడదాం, ముందు పద లోపలికి.

చంద్ర : (ముఖానికి గుడ్డ అడ్డంపెట్టుకొని దుఃఖాన్ని దిగమింగుతూ లోనికి నడుస్తాడు. వింగువరకూ సూరయ్య వెళతాడు. ఇంతలో సరోజ వస్తుంది. చేతిలో మజ్జిగతపాలా వుంటుంది.).

రంగ : పాపం. ఈ చింతలోపడి మనిషి చాలా కుంగిపోయి నట్లున్నాడు.

సూర : మనిషి శాస్తి నిబ్బరమైనవాడు గనక, అట్టట్టా బతికుండాడు.

రంగ : ఇంతకూ ఆయన కింకా ఈ భూమిమీద నూకలున్నయ్. మొత్తంమీద మంచి పనివాడులాగానే కనబడుతున్నాడు.

సూర : ఏమయితే ఏం లాభం ?

రంగ : ఏం ? ఆయన యీవూళ్లో బ్రతక లేడంటావా ? తల దాచుకోడానికి ఒక ఆధారముండాలిగాని.

సూర : దానికేం ; ఈయిల్లు జాగ్దా ? పిల్లా జెల్లా ? మేమూ ఇద్దరమేగా.

రంగ ; ఏమో. అయినవాడి వుండావని ఇంతదూరం వచ్చాడు. శాస్త కనిపెట్టి చూడు. నీపుణ్యా మెక్కడికి పోతుంది ?

సూర : చేతినిండా పనుంటే ఆ యిద్దర్నీ బతికించటం ఒక లెక్కా యేంటిగాని ?...

రంగ : చేసుకునేవాడికి పని లేకుండా పోతుందా ? ఆయనా కష్ట పడే మనిషే.

సూర : కష్టపడేవాడికి కూడెక్కడ జచ్చింది, ఈరోజుల్లో.

రంగ : అదేంమాట ! " కష్టేఫలే " అన్నారు పెద్దలు.

సూర : అంటానికేంలే. నిజానికి మనూళ్లో కష్టపడేవాడెవడు సుఖపడతన్నాడు చెప్పు, దోచుకునేవాడు తప్ప ?

రంగ : దోచుకుంటే వూరుకుంటారూ ? తీసుకెళ్ళి బొక్కలో కుక్కుతారు.

సూర : కుక్కుతానే వుండారు కూడూ, గుడ్డా అడిగినాళ్ళ నందర్నీ. నాకు తెలియక అడుగుతాను, మనూళ్ళో మూడొం

తుల పొలం సావుకారు గోపాలరావుగారిది. ఇదంతా ఆయన కష్టపడి సంపాదించిందే నంటావా ?

రంగ : ఆయన అదృష్టం అదీ. ఏమంటావ్ ? పెట్టిపుట్టాడు.

సూర : పాపం ! ఆయన పెట్టిపుట్టాడు; మిగతా జనమంతా చంపి పుట్టారు. కరువుకాలం, పావలా డబ్బులు కూలి పెంచ మంటే నా తెద్దుగాదా అంటాడు.

రంగ : మిగతావాళ్ళంతా ఇచ్చేడిశారు, ఆయనివ్వాలా, ఏం మాటల్లోయ్.

సూర : బాగా చదువుకున్నవాడు, పదిమందిచేత పనిచేయించు కునేవాడు. ఆయన సరేనంటే మిగతావాళ్లు కాదంటారూ?

రంగ : మీరు నలుగురూ కలిసివెళ్ళి అయ్యా బాబూ అంటే, పావలా గాకపోతే, బేడైనా పెంచరంటావా ?

సూర : అదీ చూస్తాం. ఇవ్వాళ నలుగురు రైతుల్నీ ఒక చోటికి చేర్చి తాడో పేడో తేల్చుకుంటాం.

రంగ : సరే, కానివ్వండి. (లేచి రెండడుగులు వేసి) ఇదిగో ! సూరయ్యా ! రేపైనా ఆ ఎరువు తోలకపోతే చాలా యిబ్బంది సుమా !

సూర : ఎందుకు తోలను? ఎడ్లూ, బండీ వుంటే.

రంగ : బండీ ఎడ్లకేం ! గోపాలరావుగా రెప్పుడో తోలుకెళ్ళ మన్నారు.

సూర : అట్టాగే అంటాను.

రంగ : ఏమంటావ్ ఇంతకీ ?

సూర : నువ్వో వెళ్ళి ఆ బండి తోలుకురా. నే వెళితే ఏదో ఒక సాకు చెప్తాడు.

రంగ : సరే.

( కనకమ్మ, సరోజ వస్తారు )

సూర : ఏరే ?

కనక : ఆ రొండు మెతుకులూ తిని యిప్పుడే నడుం వాల్చారు.

రంగ : అలసిపోయారు పాపం ?

కనక : నిదర లేచేతలికి రొండు మెతుకు లొండిపెడదామంటే పప్పుంటే వుప్పులేదు, ఉప్పుంటే పప్పులేదు. గోళ్ళాడైన కొంప. (అంటూ మంచం వెనకాల ఉన్న చీపురు అందుకోబోతుంది.)

సూర : ఉండ దేదో వొండిపెట్టవే.

కనక : చుట్టాల్ని తీసుకొచ్చి కొంపమీద తగిలి తైమంటూ నీదారిని నువుపోతావు. నీకేం ! నువ్వు చెప్తావ్.

సూర : (విసుగ్గా) ఛా ! నోరుముయ్, గాడిద.

కనక : (చీపురు అందుకొని లేచి) ఇదిగో ! ఇంటన్నావా ? రంగయ్యన్నా, యింటన్నావా ? యెట్టా జచ్చేదంట ! ఈ మొగుణ్ణి పెట్టుకొని ? నువ్వూ ఇట్టాగే చేశావా కాపరం.

రంగ : ఇదిగో, కనకమ్మా ! నామాట విను; అతనికిలేని నామర్దా మనకే వచ్చిందా ? ఉండ దేదో వండు.

కనక : నువ్వూ సరే. (ఊడుస్తుంటుంది)

సరో : పప్పు మాయింట్లో వుంద త్తయ్యా !

కనక : మీ ఇంటో యేం ! కోమటింటికాడా వుంది. రొండు కోడిగుడ్లుంటే రాత్రే మింగాడు. అయ్యుండా పోయేది.

సూర : ఓసి నిన్ను తగలెయ్య నేను కావాలన్నానా? నువ్వే వండి పెట్టావుగా!

కనక : (ఊడవడం ఆపి రంగయ్యవైపు తిరిగి) అదీ తప్పేనా! ఇదిగో రంగయ్యన్నా! పెద్దాడివి నువ్వు చెప్పావుగా తెస్తే వండి పెడతా, లేకపోతే మెదలకుండా కూచుంటా, మాట్లాడితే వొట్టు. (అంటూ ఊడవడం ప్రారంభిస్తుంది. సూరయ్య మంచంమీద కూర్చునుంటాడు. అతని కాలికి చీపురు తగిలిందేమోననే సందేహంతో ఆయన కాళ్లను కళ్లకద్దుకొని, తిరిగి మామూలు ధోరణిలో) కాద్దియ్యి. (సూరయ్య కాళ్లు పైకితీయగా మళ్ళీ వూడవడం ప్రారంభిస్తుంది)

రంగ : ఆపనిచెయ్యి సూరయ్యా తిక్క కుదురుతుంది. (రెండడుగులువేసి వెనుకకు తిరిగి) ఇదిగో! సూరయ్యా, రేపు ఎవరికైనా మాటిచ్చేవు!

కనక : చుట్టాలకు నాలుగు పకోడీ లొండిపెడదామంటే, పిండీ లేదు, నూనీ లేదు, నాశనమై. అయినా నాకెందుకులే, మాట్టాడొద్దన్నారుగా. (చీపురుగట్ట దులుపుకుంటూ లోనికి వెళుతుంది.)

రంగ : (నవ్వుతూ) రా సరోజా వెళదాం. (ఇద్దరూ వెళతారు.)

సూర : (మంచంమీద వెల్లికిలా పండుకొని ఆగిఆగి) ఇదిగో!...... నిన్నే,...ఎక్కడా? (లేచి కూర్చొని లోనికిచూస్తూ) మాట్టాడదేం?

కనక : (వచ్చి) ఎందుకూ?

సూర : ఇట్టా రా!

కనక : ఏం దాసిపెట్టా?

సూర : రమ్మంటే...అదే మల్లీ ... (కనకమ్మ దగ్గరకు వెళుతుంది) కూచో.

కనక : చెప్పరాదూ ! అవతల బోలెడంత పనుంది. (కూర్చుంటుంది)

సూర : దాని దేంటిలే. ఎప్పుడూ వుండే పనేగా ?

కనక : నీ కట్టాగే వుంటంది.

సూర : సరేగాని. ఇంతకీ ఏంజేద్దాం మనాళ్ళని, ఇక్కడే వుండమందావా ?

కనక : బాగానేవుంది. నీయన్న, నీయన్న కూతురు. నన్నడుగుతావేం ?

సూర : నా దేంటిగాని, ముందు నీసంగతి చెప్పు?

కనక : ఏంటి చెప్పేది. చెప్పూ, చాంతాడూ.

సూర : ఇదిగో! ముద్దొచ్చినప్పుడే చంకెక్కాలి.

కనక : ఓయబ్బ! ముద్దు మూరెడు, మూతి బారెడూ.

సూర : సరె. ఇష్టంలేనప్పు డెందుకు ? రెండురోజులుండి ఆళ్ళ దారి నాళ్ళుబోతారు.

కనక : ఎక్కడికి పోతారు ?

సూర : అదీ నీకేగావాలి; వాళ్ళిష్టం.

కనక : రావటం వాళ్లిష్టమే, పోవటం వాళ్లిష్టమే? ఇంకా నే నాపిల్లని పోనీయకేం ?

సూర : ఏం జేస్తావ్ ?

కనక : నాకు బిడ్డల్లేనందుకు దేవుడుపంపా డాపిల్లని. నిర్మల తిరుగుతావుంటే, ఇల్లంతా కళకళ్లాడతాంది. ఏం వనుకున్నావో !

సూర : అయితే ఇక మా అన్నయ్యనేనా వెళ్ళగొట్టేది ?

కనక : నా కెందు కాగొడవ, తమ్ముడిష్టం, అన్నిష్టం. తెచ్చు కుంటే నీ కొండిపెట్టినట్టే, ఆయనికీ యింతొండిపెడతా.

సూర : ఏదో, నీదయ.

కనక : చాల్లే, నీయూసాలూ నువ్వూ.

సూర : ఏసాలా ! కోపమొచ్చినప్పుడు ఒక దెబ్బకొట్టినా, నువ్వంటే... (ముద్దుగా చెంపమీద కొట్టబోతాడు.)

కనక : (తప్పించుకుని) చాల్లె ఎవరన్నా చూస్తే నవ్విపోతారు. (వయ్యారంగా లోనికి వెళుతూవుంటుంది.)

సూర : ఇదిగో !

కనక : ముందు పిల్లకి తలదువ్వి జెడెయ్యాలుండు. (వెళుతుంది.)

(సూరయ్య ఆమె వెళ్లినవైపు కొంతతడవుచూసి ఇటు తిరుగుతాడు. రామదాసు, పుల్లయ్య వస్తారు. రామదాసు వయస్సు 50 సం. పుల్లయ్య వయస్సు 30 సం. దృఢకాయుడు, బనీను తొడుక్కున్నాడు. రామదాసు మాసికలువేసిన చొక్కా తొడుక్కున్నాడు. తల, గడ్డం నెరిసింది.)

సూర : ఎవరూ ? రామదాసా ! రా రా పుల్లయ్యా.

రామ : వా రేరి బాబూ ! (మంచము ప్రక్కనున్న స్టూలుమీద కూర్చుంటాడు)

సూర : ఎవరు ?

రామ : అదే. పొలాన్నుంచి వచ్చేటప్పుడు మనకు దారిలో కలవలా ...

సూర : ఓహో, మా అన్నయ్య సంగతా ! ఇప్పుడే అన్నం తిని పడుకున్నారు.

పుల్ల : ఎన్నాలయిందో పాపం ! కడుపునిండా తిని, కంటినిండా నిదరోయి. పడుకోనియ్యండి.

సూర : సరేగాని పుల్లయ్యా! ఏంటి సంగతులు

పుల్ల : ఏట్టో మన్ను, దుమ్ము.

రామ : కాలం యిట్టాగే వుంటే ఏట్టో గాదు, మన నోట్లోనే పడతం దా దుమ్ము.

సూర : మంచిమాటన్నావ్.

రామ : ఏం బాబూ, ఏదో మట్టిపనుందంటివిగా ? గోపాల రావుగారి చేలో ఎమయిందదీ ?

సూర : ఉంది వుండటానికి; ఆ దొర రేటు గుదరని స్తేగా ?

పుల్ల : ఏమంటాడు ?

సూర : ఎంతసేపూ ఆ కబుర్లూ, యీకబుర్లూ చెబుతాడు; అసలు సంగతి తేలనియ్యడు.

పుల్ల : ఆయన తేలనిచ్చే దేంటి; ఇంతయితే చేస్తాం, లేకపోతే లేదని నువ్వే తెగేసి చెబితే పోయేదానికి.

రామ : ఓ రుండరా సన్నాసిరాముడా, నీపాటి తెలవకే వూరు కుంది. ఆ దొరసంగతి నీ కేం తెలుసు ! ఆవులిస్తే పేగు లెక్కెడతాడు.

సూర : (పుల్లయ్యతో) గజానికి పావలా యిస్తాడంట చేస్తావామరి?

రామ : పావలా ! ఇంకానయం, వూరికే చెయ్యమన్లా.

పుల్ల : అదీ అంటాడు చేసేవాడుంటే.

సూర : మాటలుమాత్రం అరిటిపండొలిచి చేతిలోపెట్టినట్టు చెప్తాడు. మనకోసమేనంట యీ యవసాయం చేయించేది. లేకపోతే యెప్పుడో మానుకునేవాడంట.

పుల్ల : మానుకోమను. ఊరు పీడా ఒదుల్తుతుంది.

రామ : ఆయన మాటలకేం గాని, నలుగురు రైతుల్నీ ఒక చోటికి పిల్చి అడుగుదాం పదండి.

పుల్ల : అడిగితే పెంచుతారూ కూలి !

రామ : అడగాలిసిన విధాయకం పెకారం అడుగుదాం. మన కష్ట సుకా లాలోచించి కూలి పెంచెనా పెంచుతారు. కాదూ ! అప్పుడే ఆలోచిద్దాం.

[మోహనరావు వస్తాడు]

మోహ : ఏఁవిటది ?

సూర : రా, రా, మోహన్; సమయాని కొచ్చావ్.

పుల్ల : ఎవరొచ్చి యేంజేస్తారు, మనలో సరుకులేనప్పుడు ?

రామ : ఓకుండరా పిచ్చినాయాల, అడగందే అమ్మయినా బువ్వెట్టదు (మోహనరావుతో) ఏమంటావ్ బాబు ?

మోహ : అది నిజమే. ఇంతకూ విషయమేఁవిటి?

సూర : రైతులు నలుగుర్నీ కలుసుకుని కష్టసుఖాలు చెప్పుకుఁదామంటాడు రామదాసు. చెప్పుకుంటే కూలి పెంచుతారా అంటాడు పుల్లయ్య.

మోహ : అదంతా మన శక్తిమీద ఆధారపడి వుంటుంది.

సూర : అంటే ?

మోహ : కూలీలంతా ఒక్కమాటమీద నిలబడాలి. అప్పుడు కొంతవరకైనా కూలి పెరిగే అవకాశం వుంటుంది.

పుల్ల : అయినా పెంచరు, ఏం చేస్తా ?

సూర : మనాళ్ళు నలుగురూ కలిసిరావాలిగాని, కొండమీద కోతి దిగిరాదూ!

రామ : మనిషి కొకదారి ఏం కలిసొస్తారో ?

పుల్లి : కలిసిరా కేం జేస్తారు, కడుపులో కాల్తావుంటే, మనింటో పెళ్ళా !

సూర : అదీ మాట.

రామ : సరె, కానియ్యండి

సూర : సాయంత్రం మనాళ్ళు నలుగుర్నీ ఒకచోటికి పోగు చెయ్యండి. దీనిసంగతి మాట్టాడదాం.

రామ : అయితే యిప్పటినుంచీ ఇంటింటికీ తిరిగి చెప్పాలి.

సూర : సరే, మీరా రాపని చూడండి.

రామ : (పుల్లయ్య, రామదాసు వెళుతూవుంటారు. రామదాసు రెండడుగులు వెనక్కి వేసి) ఇదిగో ! సూరయ్యగారూ ! మీరు కాపెందలాడే రావాలి. (మోహనరావుతో) నువ్వుకూడా బాబు

మోహ : తప్పకుండా వస్తాను.

పుల్లి : మా పల్లెకేగాదు. రేపు రైతులదగ్గిరకుకూడ రావాలి.

మోహ : అలాగే.

(రామదాసు, పుల్లయ్య వెళతారు. చంద్రయ్య కళ్ళు నలుపుకుంటూ వస్తాడు.)

సూర : రా. అన్నయ్యా (మోహన్‌తో) ఈయన...

(చంద్రయ్య మంచంమీద కూర్చుంటాడు.)

మోహ : తెలుసు, మా సరోజ అంతా చెప్పింది.

సూర : చెప్పింది, (చంద్రయ్యతో) ఈ కుర్రాడు రంగయ్యబావ కొడుకు. ఈయేడే మెట్రిక్లేషన్ పాసయ్యాడు.

చంద్ర : అట్టాగా, ఇంకా చదువుకుంటన్నావా అబ్బాయ్ ?

సూర : కుర్రాడికి చదువుకోవాలనే వుంది. తండ్రి ఒప్పుకోటల్లా ఆయనకీ డబ్బుకీ లంకె.

(ఒకవైపునుండి సరోజ, రెండవవైపునుండి కనకమ్మ వస్తారు.)

సరో : అక్కయ్యేదీ ?

కనక : అక్కయ్యగాదమ్మా. వదిన.

సరో : సరేలే. ఏదీ ?

కనక : లోనుంది. అమ్మాయ్, నిర్మలా, నిర్మలా!

(నిర్మల వచ్చి మోహనరావును చూచి, వెనక్కి తగ్గుతుంది.)

కనక : పరవాలేదులే, రా అమ్మా మనాడే.

సరో : మా అన్నయ్యే వదినా! (అంటూ నిర్మలదగ్గరకు వెళుతుంది.)

రాఘక : అబ్బాయ్ మోహనరావ్ ! ఏదన్నా పాటల బొక్కుంటే ఓ ఇయ్యి నాయనా మమ్మాయికి.

మోహ : మన్నయ్య దగ్గర ఇన్ని పుస్తకాలుండయ్ వదినా.

సూర : ఊం. (మోహన్‌తో) వాటిల్లో తెలవంది ఏఁవన్నా వుంటే కాస్త చెప్పుతావుండరా అబ్బాయ్.

మోహ : అలాగే.

(చంద్రయ్య, సూరయ్యవైపు యిదేమిటన్నట్లు చూస్తాడు.)

సూర : మనింటో పిల్లా జెల్లా లేరుగదూ. ఎప్పుడూ ఇక్కడే చదువుకుంటూ వుంటాడు.

సరో : పాటలపుస్తకాలుకూడా వుండయ్ వదినా ! తేనా ?

కనక : అయ్యన్నీ నీ కొచ్చుగా !

సూర : ఏదీ, ఒకటి పాడవే పిల్లా.

సరో : ఎ ఫో !

కనక : చాల్లే, వయసుడిగినా వయ్యారం తగ్గలా; నీ కెందుకు నువు పాడమ్మా, పాడు.

సూర : నా యెదట పాడ కేం !

సరో : ఏం ? పాడితే ఏం జేస్తావ్ ?

సూర : పాడు చెప్తాతా.

మోహ : (నవ్వి) ఆఁ. మళ్ళీ మనం పల్లెకు వెళ్ళాలిగా (చంద్ర య్యతో) వస్తా.

(చంద్రయ్య సరేనన్నట్టు తల వూపుతాడు, మోహన్ వెతాళడు.)

సూర : (సరోజతో) ఇంతేనా పాడ వేంమరి.

సరో : నాయిష్టం.

కనక : స రే, లెండి, ముందు పలారం చేద్దురుగాని.

సూర : ఓ పలారం ! ఏంటది ?

కనక : ఏదో ఒకటి, నాకు చేతనైంది. అన్నీ అజలు.

(లోనికి వెళ్తుంది, సరోజ బయటికి పోతూవుంటుంది)

నిర్మ : సరోజా.

సూర : ఏమ్ పిల్లా ! ఎక్కడ కట్లా పోతావ్, పదలోనకి.

సరో : ఇదుగో మావాఁ నాకు కోపంవచ్చిందంటేనా.

సూర : ఏం వస్తే; న న్నేం పెళ్ళాడతావా (అంటూ లోపలికి తోస్తాడు. సరోజ సూరయ్యచెయ్యిమీద కొట్టి వెక్కిరించుకుంటూ నిర్మలతో కలసి లోనికి వెళుతుంది. సూరయ్య నవ్వుతూ చంద్రయ్య వైపు చూస్తాడు.)

చంద్ర : ఏంటిరా, చిన్నపిల్లతో (లేచి సూరయ్యతో లోనికి వెళ తాడు) [ తె ర ]



# భూమి కోసం

## రెండో రంగం

[పగలు 10 గంటలు. గోపాలరావు భవనంముందు తల చావడి. ఒక డ్రాయరు, నాలుగు కుర్చీలు, ఒక బెంచి వుంటాయి. టేబులుమీద తెల్లటిగుడ్డ పరచి వుంటుంది. పేపరు వెయిట్, కాతా పుస్తకాలు, ఫ్లవర్ పాట్, మొదలైన సామానులుంటాయి. ఎదురుగా గోపాల రావు ఫోటో, దాని ప్రక్కన యూరోపియన్ యువతి అర్ధనగ్న చిత్రం వుంటాయి. రాముడు స్టేజిమీదికి వస్తాడు. కోరమీసం, దుబ్బుక్రాపు, వలబనీను, మట్టగోచీ, భుజాన టర్కీ టవలు, మెడలో ఆంజనేయులు బిళ్ల, కుడిదండకు వస్తాదుత్రాడు వుంటాయి. రాముడు టేబిలుమీద సామాన్లువగైరా సర్ది ఫోటోలమీద దుమ్ము దులుపు తాడు.

వక్క పొడి నవులుతూ గోపాలరావు వస్తాడు. ఖద్దరు సిల్కు లాల్చీ, మడత విప్పని పొందూరు ఖాదీ ఉత్తరీయం, కత్తిరించిన మీసాలు, కాళ్లకు కాన్వాసు చెప్పులు, కళ్లకు జోడు, చేతికి గడియారం, వ్రేళ్లకు వుంగరాలు, సిగరెట్టుటిన్ను, అగ్గిపెట్టె.]

గోపా : (ఉత్తరీయం కుర్చీమీదవేసి కూర్చుంటూ) అరేయ్! రాముడూ

రాము : అయ్యా!

గోపా : ఏఁవిటిరా ఊళ్ళో సంగతులు!

రాము : ఇంకా మీకు తెలవలా ? రాత్రి పల్లెలో మీటింగం.

గోపా : ఒహో! పైనుంచి ఏ నాయకుడైనా దిగాడా ?

రాము : అదేమీలేదులెండి. ఊళ్ళోవాళ్లే నలుగురొచ్చారు.

గోపా : ఊళ్లోవాళ్లా ? ఎవరెవ్రరా ?

రాము : రంగయగారబ్బాయి, సూరయ్య, యింకా నలుగురు జక్కాయి బుక్కాయిగాళ్ళూ.

గోపా : ఊఁ, సరే. ఏఁవనిరా మీాటింగు ?

రంగ : (ప్రవేశించి) ఎక్కడుందోయ్ మీాటింగు ?

రాము: ఏంటుందోయ్ రంగయ్యగారూ. తెలవనట్టడుగుతుండారు. అసలు కతానాయకుడే మీా అబ్బాయిగారయితేను.

రంగ : అందుకనా రాత్రి పొద్దుపోయివచ్చాడు దొర.

గోపా : బంగారంలాంటి కుర్రాడు చెడిపోయేను, కాస్త జాగ్రత్త పడు.

రంగ : ఆ విషయనే తమతో మనవి చేసుకోవాలనుకుంటున్నాను.

గోపా : దానికి నే నేంజేస్తాను ?

రంగ : ఏదైనా వుద్యోగం...

గోపా : ఇప్పించమంటావు.

రంగ : చిత్తం.

గోపా : ఎందరికని సిఫారసు చెయ్యను.

రంగ : ఏదో తమదయ.

గోపా : పరిస్థితులు మారిపోయినై. మాటలతో పనులు కావయ్యా.

రంగ : మీాకు తెలిసిందేగా నా పరిస్థితి. ఏదో...

గోపా : సరే రేపు వెళ్ళేటప్పుడు జ్ఞాపకం చెయ్యి. అరేయ్ రాముడూ !

రాము : అయ్యా !

గోపా : తోటదగ్గరకు వెళ్ళొచ్చావా ?
రాము : ఓ. అక్కడ నాలుగు గేదెలుంటే దొడ్డో పెట్టాకూడా.
గోపా : ఎక్కడ ! మన తోటలోనా ?
రాము : మన తోట్లోకి రావటమే ! కంచపక్కనున్న బంజర్లో వుంటేను.
గోపా : సరే. వెళ్ళి పని చూసుకో.
(రాముడు వెళతాడు)
రంగ : తోట అంటే జ్ఞాపకం వచ్చింది. దాన్ని పెంచడానికి మనిషి కావాలన్నారుగా.
గోపా : అవును. ఎవడైనా వున్నాడా ?
రంగ : ఉన్నాడులెండి, చాలదిట్టమైన మనిషి.
గోపా : ఎక్కడున్నాడు ?
రంగ : ఎక్కడో గాదు. మన సూరయ్య యింట్లో. పడమరనుంచి వచ్చాడు.
గోపా : అయితే అతనికి తోటపని బాగా తెలిసేవుంటుంది. ఇంతకూ సరిగా పనిచేసే రకమేనా ?
రంగ : పనా ? ఆయన చెయ్యకపోతే ఇంకెవరు చేస్తాడండీ, చూస్తారుగా.

(శంకరయ్య, జానయ్య వస్తారు. శంకరయ్య వయస్సు 45 సం.లు జానయ్యకు 36 సం.లు. శంకరయ్య ఆహారం, తెల్లని కట్టుపంచ, పైపంచ ధరించాడు. తల కొద్దిగా నెరిసింది. కొనపోగు, చిన్నమీసం, వ్రేళ్ళకు ఉంగరాలు, చేతిలో తలకాయబెత్తం, కాళ్ళకు తగరం కుట్టిన చెప్పులు.

జానయ్య ధోవతి, ఉత్తరీయం, చారల హాఫ్ షర్టు, క్రాపు, కత్తిరించిన మీసం, అరుచెప్పులు, చేతికి గడియారం ధరించాడు.)

గోపా : ఓ, శంకరయ్యగారా ! రండి, రండి. (లేవబోతాడు)

శంక : కూర్చోండి, కూర్చోండి.

గోపా : (వాళ్ళిద్దరికీ కుర్చీలు చూపిస్తాడు. అంతా కూర్చుంటారు)

ఏం! జానయ్యా! ఏమిటి విశేషం?

జాన : మరేం లేదు. మన కూలీలగొడవే. మీతో సంప్రదించు దామని.

గోపా : అలాగా, అరే రాముడూ! (రాముడు వస్తాడు) నాలుగు కాఫీలు తయారుచేయించరా.

శంక : అక్కర్లేదు, అక్కర్లేదు. ఇప్పుడే భోజనంచేసి ఇట్లా వచ్చాం.

గోపా : దానికేం లెండి.

జాన : అబ్బెబ్బే! అదిగాదు; ఇంకా చెయ్యి తడైనా ఆరలేదు.

గోపా : (రాముడితో) సరే పోరా (వాడు వెళతాడు)

రంగ : భోజనం చేసినతర్వాత ఒక కునుకుతియ్యందే శంకరయ్యగారెటూ బయలుదేరరే!

శంక : పనికలిగినప్పుడు తప్పుతుందీ? కూలీ లెట్లాగూ ఇప్పుడిక్కడికి వస్తారుగా. ఆ గొడవేదో ముందుగా గోపాలరావుతో సంప్రదించితే మంచిదని. . .

గోపా : ఈ మాత్రానికి ఎండలో రావాలా! పెద్దవారు. మీరేంచేస్తే కాదంటాను.

జాన : ఆ చేసేదేదో నలుగురం ఆలోచించుకొని చేస్తే బాగుంటుంది. ఏమంటావ్ రంగయ్యా?

రంగ : కాదు మరీ!

గోపా : ఇంతకూ వాళ్లు ఏడ్చేడ్చేదేమిటి?

శంక : ఒక పావలా కూలి పెంచమని.

గోపా : వాళ్లకేం? ఎంతయినా పెంచమంటారు. అసలు మీ అభిప్రాయ మేమిటో తేల్చండి, ఈ విషయాలో.

జాన : ఊళ్లోకి మోతుబరి ఆసాములు మీరు. ఏది చేసినా మీరు చెయ్యాలి. మీతోపాటు మేమూ.

రంగ : అదేమన్నమాట! ఆయనతోపాటు మీరివ్వగలరా? అవసరమనుకుంటే యివ్వాళ ఆయన మనిషికి నాలుగు రూపాయలు అవతల పారేస్తాడు.

శంక : వాళ్ల పోరు చల్లార్చటానికి ఏదో అణో, బేడో అయితే అట్లాగే తగలేస్తాం. అంతేగాని గోపాలరావుతో మే మెక్కడ తూగుతాం?

గోపా : అవునుగద! అణో, బేడో అయితే మీబోటివాళ్లు ఎవరో నలుగు రివ్వగలుగుతారు. మిగతా సన్నకారు రైతుల గతి ఏంకావాలి? వాళ్ళు ఈ కూలే బరువయిందని గోల పెడుతున్నారు.

జాన : అదీ నిజమే మరి!

శంక : మరి వీళ్ల గోల ఏం చేద్దాం?

రంగ : ఏం చెయ్యాలి, మావల్ల కాదురా అబ్బాయ్ అంటే కొడతారా?

జాన : ఇదిట్లా వుండగా ఆ బంజరొకటి దున్నుతామని ఏడుస్తున్నారు.

శంక : అవును, అదొక గొడవ వచ్చింది. ఏమంటావ్ గోపాలరావ్?

గోపా : రాజకీయబాధితుల కివ్వాలంటేనే భూమి దొరక్క ప్రభుత్వం నానాఅవస్థలు పడుతోంది. మన మెక్కడ తెచ్చిస్తాం వీళ్ళకి భూములు ?

శంక : లేకపోతే ఏ చిక్కూ లేదు, కాస్తో కూస్తో మన ఊళ్లోనూ తగలడిందిగా బంజరుభూమి !

రంగ : అయినా యీ కూలి ముండాకొడుకులకు వ్యవసాయ మెందుకండీ ? వాళ్ళ తాత తండ్రులు సంపాదించింది ఎకరమో, అరెకరమో వుంటే నిలుపుకోటం చేతకాక మీకు, గోపాలరావుగారికి అమ్ముకున్నారు.

జాన : వాళ్లేం చేసుకుంటే మన కెందుకు.

గోపా : వాళ్లింతటితో ఆగితే అందువల్ల మనకొచ్చిన నష్ట మేమీ లేదనుకో.

శంక : ఆగక ఏం చేస్తారు ? ఎగిరిపోతారా !

గోపా : చీమదూరే సందిస్తే నెత్తినెక్కి కూర్చుంటారు. ఇవ్వాళ బంజ రాక్రమిస్తారు, రేపు గట్లు గదుముతారు. అదేమి టంటే అదీ బంజరులోదే అంటారు.

రంగ : కాదని ఎట్లా అంటాము. శంకరయ్యగారు దాదాపు అయిదారెకరాలు కలుపుకున్నారు.

జాన : ఒక శంకరయ్యగారన్న మాటేమిటి ? ఆ బంజరుప్రక్క నున్న ప్రతి రైతు అంతో యింతో కలుపుకున్నాడు.

గోపా : అప్పను మా భూమిలోనూ ఏదో కొంత కలసివుంటుంది. అవసరమయితే రేపీపాటికి విడగొట్టిస్తాను.

రంగ : అది వదులుకోడం మీ కొక లెఖ్ఖలోవిషయం కాదనుకోండి. తతిమ్మా రైతుల సంగతీ ?

గోపా : ఇట్లాంటివే అనేక మొస్తాయి.

శంక : ఇదంతా చూస్తే నా కేదో గందరగోళంగా వుంది.

గోపా : పోనీ వీటన్నిటికీ సహించి దున్నుకోనిచ్చానే అనుకోండి; ప్రతి కూలి వెధవా సరిగ్గా తరుణంలో నాకూ సొంత పనుందంటాడు. కావాలంటే మనకు సరయిన జీతగాడుకూడ దొరకడు. ఇటు రైతుల్ని నష్టపరుస్తారు. అటు వాళ్లూ బాగుపడి చావరు.

శంక : అంత్య నిష్ఠూరం కంటె ఆదినిష్ఠూరం మెరుగు; ఎందుకొచ్చిన తద్దినం ఇదంతా ?

గోపా : సరే. ఉన్న విషయం అదీ, ఆలోచించండి.

రంగ : ఆఁ, వెళ్లొస్తానండి.

శంక : ఉండవయ్యా, వెళ్లొచ్చు.

రంగ : కాస్త తొందర పనుంది. వెళ్లాలి (ముందుకు నాలుగడుగులు వేసి) గోపాలరావుగారూ, రేపయినా కాస్తి మన బండీ ఎళ్లా .........

గోపా : మొన్ననే చెప్పానుగదయ్యా, ఇన్నిసార్లా. తోలించుకెళ్ళు.

రంగ : చిత్తం చిత్తం (నాలుగడుగులు వేస్తాడు)

గోపా : ఇదిగో రంగయ్యా !

రంగ : (వెనుదిరిగి) అయ్యా !

గోపా : ఇందాక చెప్పావే, ఆ విషయం...

రంగ : ఇప్పుడే ఆ పని చూస్తా (వెళ్లిపోతాడు)

శంక : ఇదిగో జానయ్యా ! నీదగ్గర ఏమైనా వంకసన్నం నారు దొరుకుతుందా ?

జాన : నా దగ్గర లేదుగాని, సుబ్బయ్యగారి శ్రీరాములు దగ్గర వుంది.

శంక : అదా ! ఆ మడంతా గొడ్లు నాశనం నాశనంగా తొక్కేసయ్యట.

గోపా : పాపం !

శంక : వాడి ఆకుమడి పాడుజేసింది మీ గొడ్లేనటగా ?

గోపా : అతడన్నాడా ?

శంక : అనటమేంవిటి ఒకటేగోల. ఆచేలోనుంచి గిద్దెడుగింజలు వాడింటికి వచ్చి మూడు సంవత్సరాలయిందట మీ పశువులమూలాన.

గోపా : (నవ్వి) మా పశువులకు మేత లేక వాడి చేను మేసించా నంటారా ? ఆ వెధవ వాగితేమాత్రం నమ్మేదెవడు.

జాన : మన ఊళ్లో అదేమీ లేదులెండి. ఇదిగో తోక అంటే అదిగో పులి అంటారు.

గోపా : ఇది మంచికి కాలంకాదు శంకరయ్యగారూ ! మన దక్కడ డెబ్బై ఎకరాలు. దానిమధ్యలో పడ్చింది యీ శ్రీరాము లన్నదములు ముగ్గురికీ మూడెకరాలు.

జాన : అదంతా మాకు తెలిసిందేగా; శ్రీరాముద్దితప్ప మిగతా రెండువాటాలూ మీరు కొన్నారుకూడాను.

గోపా : ఎందుకు కొన్నానంటారు ? నాకు భూమి చాలకనా !

శంక : ఆ మాట ఎవడంటాడు. ఏదో చేలో చేను కలుస్తుందని కొనివుంటావు.

గోపా : నిజానికి నా అభిప్రాయం అది కానేకాదు. కేవలం ఇట్లాంటిగొడవ లొస్తుంటాయనే.

జాన : అట్లాంటప్పుడు శ్రీరాములు భూమికూడ ఒక వంద అటో ఇటో తీసుకుంటే పోయేదిగా !

గోపా : అదీ అయ్యింది. వందగాదు రెండువంద లిస్తానన్నాను. నిజంగా వాడికి భూమికావాలనివుంటే నేను ఇచ్చేడబ్బుల్తో రెండెకరాలు వస్తుంది ఏటొడ్డునయితే. కొనుక్కోగూడదూ హాయిగా !

జాన : ఏఁవంటాడు ?

శంక : అది వాడితాత సంపాయించింది. కనుక దాన్ని అమ్మటం వాడి కేమాత్రం ఇష్టంలేదు.

గోపా : ఆఁ, ఇవన్నీ పైకి మీాబోటివాళ్ళతో చెప్పేకబుర్లు. ఆ యెకరాన్నాధారం చేసుకొని, చుట్టూవున్న మనడెబ్బై ఎకరాల్లో తన పశువుల్ని మేపుకోడానికి అలవాటుపడ్డాడు.

జాన : అసలు సంగతి ఇదన్నమాట !

శంక : వాడిసంగతి అట్లా వుండనియ్. ఆ మిగతావాళ్ళిద్దరి దైనా రిజిస్టరు చేయించుకోలేదేం ?

గోపా : శ్రీరాములు వాటా విషయంకూడా తేలిపోతుందేమో, అంతా ఒకేసారి రిజిష్టరు చేయించుకుందామనుకున్నాను.

జాన : ఎగ్రిమెంటు రాయించుకుని భూమి స్వాధీనం చేసుకున్నారుగా. రిజిష్టరుకేం, ఎప్పుడైనా చేయించుకోవచ్చు.

(మోహన్‌రావు, సూరయ్య, రామదాసు, పుల్లయ్యలు వస్తారు)

రామ : దణ్ణాలండి.

గోపా : (బల్ల చూపుతూ) కూర్చోండి.

(మోహన్‌రావు, సూరయ్యా కూర్చుంటారు)

శంక : ఏరా అబ్బాయ్, సూరయ్యా! ఎంతసేపని కూర్చోం మీకోసం ?

సూర : ఏం జెయ్యమంటారు!

రామ : మీకు తెలిసిందేగా మాబతుకు. పొయ్యిమీదకుంటే పొయ్యికిందకుండదు. పొయ్యి కిందకుంటే పొయ్యిమీద కుండదు. కూడుడికేసరికి ఈయాలయ్యింది.

జాన : ఏదైనా మాటచెప్పితే అతకాలి రామదాసూ! ఈ రోజుల్లో తిండికి గింజల్లేవంటే ఎవడు నమ్ముతాడు? ఎందు కొచ్చిన బీదరపులంట.

మోహ : లేనివాడు బీదరపు లరవడం సహజం. కానీ...

గోపా : అరే పుల్లాయ్! గిత్త పూడపేసుకుంది, కాస్త కట్టివేసి రారా.

రామ : పోరా పుల్లయ్యా. (అతను వెళతాడు)

గోపా : రామదాసూ! నుంచున్నావేం ?

రామ : ఫరవాలేదులెండి. దొరలు నలుగురూ ఒక చోటుండారు, మా మాటేదో సెలవిస్తే, పోయి పనిచూసుకుంటాం.

గోపా : ఏం చెప్పమంటావ్!

రామ : కరువుకాలం, ఒక పావలాడబ్బులు కూలిపెంచమని, అంతేబాబూ.

గోపా : ఇదివరకు మీకు పెంచమంటేనే పెంచామా కూలి!

శంక : ఎప్పటి కప్పుడే ఏకాదశి. ఎంతపెంచితే ఏముంది?

సూర : ఆసంగతి మీకు తెలుసనేగా, కూలిపెంచమనేది.

రామ : మన కష్టసుఖాలు వారు కనిపెట్టకపోతే ఎవరు కని పెడతారు ?

గోపా: అదిగాదు రామదాసూ! నీలాంటి పెద్దవాళ్లు అడగనూవచ్చు, మేం పెంచనూవచ్చు. లాభం! యీ నాలుగురోజులూ తాగి తందనాలాడతారు. తర్వాత?

(పుల్లయ్య వస్తాడు)

జాస: ఎప్పటూటు కాటున్న, అంతే.

పుల్ల: అసలు దుకాణాలే ఎత్తేయించారుగా, ఇంకా తాగు డేంటి, తాగుడు.

గోపా: అవును, పేదల్ని బాగుచేయడానికి మన పెద్దలంతా ఆలోచించే ఈపని చేశారు.

సూర: (వ్యంగ్యంగా) అంతేలెండి!

శంక: చేప లాంభం? ఇంటి కొక బట్టీ పెట్టారు. అట్లా పొలం మీదకెళ్ళి చూడు.

మోహా: వీటి దొక లెక్కలో విషయంగాదులెండి. పట్టణాల్లో మేడలమీద వెలిశాయట యీ బట్టీలు వేలకు వేల పెట్టు బడితో. అడిగే దిక్కులేదు.

పుల్ల: నిజంగానా బాబూ!

గోపా: (విసుగ్గా) వాడూ నీలాంటి దౌర్భాగ్యుడయ్యుంటాడు.

సూర: పది రోజులనాడు నే నొకమాట విన్నాను, గోపాలరావు గారూ!

గోపా: ఏమిటది?

సూర: మన బస్తీలో ఒకమేడమీద సారాబట్టీ వుందంట.

గోపా: ఊం, వుంటే?

సూర: మ రేంలేదు. అందులో మనకీ వాటావుందన్నారులెండి.

గోపా: నాకా?

సూర : ఆఁ.

గోపా : ఎవ డా కూసింది ?

సూర : ఒకడన్న మాటేంటి ? ఎక్కడ చూసినా ఒకటే గుస గుసలు.

శంక : తిన్న దరక్కపోతేసరి, పిల్లి మీదఎల్లి, ఎల్లి మీదపిల్లి.

జాన : బాగాచెప్పారు, లేకపోతే వీళ్ళంతా చూచిచచ్చారు !

సూర : సరీగా నేనూ ఇదే మాటడిగా, మీరంతా చూచి చచ్చారా, అని !

జాన : ఊఁ, అడిగితే ?

సూర : చాల్లే వూరుకోవయ్యా, నిప్పులేని పొగుంటుందా అన్నారు. ఇం కేఁ మాట్టాడను !

పుల్ల : అక్కడదేగాఁ వాలు, మొన్న దొరగారింటికి ఇంత పొడుగుసీసా వచ్చింది. యాభైరూపాయలంట ! ఆర్టాగి పోయింది.

మోహ : అది గొప్ప గొప్పవాళ్లు సేవించేది. అజీర్తి చేసి నప్పుడు మందుగా ప్రయోగిస్తారు పుల్లయ్యా !

గోపా : కాదురా మోహన్, ఈమధ్య అమ్మాయి ప్రసవించి నప్పుడు తెప్పించా.

సూర : దానిదేంటిలెండి, అట్టాంటప్పుడు ఒకటికి నాలుగు సీసాలు దింపితేమాత్రం ఏం ?

రామ : ఇదిగో సూరయ్యగారూ ! మనం వచ్చిన పనేంటి, యీ గొడవేంటి ?

మోహ : తీగ లాగితే డొంక కదిలింది, అంతే; - గోపాలరావు గారూ ! వాళ్ళ విషయ మేదో తేలిస్తే వెళ్ళిపోతారుగా.

గోపా : తేల్చడానికీ, తేల్చకపోవడానికీ ఇది ఒకరిద్దరితో అయ్యే పనిగాదు. అందులో ఇవ్వాళ రైతులస్థితి ఎంత అస్తవ్యస్తంగా వుందో నీకూ తెలుసుగా; వచ్చే ఆదాయం ఎక్కడానాకూ, పాలేళ్ళ జీతాలకూ, ఎరువులకూ, వ్యవసాయ ఖర్చులకూ చాలక రైతులు అప్పుల పాలవుతున్నారు.

శంక : రైటే ! ఈ యేడు నామట్టుకు నాకు పిల్ల పెళ్ళిచేస్తే నాలుగు వేలప్పయ్యింది.

జాన : అందాకా ఎందుకండీ ! ఒక్క పిల్లవాడుంటు, వాడి చదువుకు చాలడం లేదు ! నా ఆదాయం.

గోపా : మన పరిస్థితులే ఇంత అధ్వానంగావుంటే ఇక చిన్నరైతుల సంగతి వేరే అడగాలా !

మోహ : మీరు కూలి పెంచాలిగాని, యే చిన్న రైతుకూ అభ్యంతరం వుండదు.

గోపా : ఎందుకనో ?

మోహ : ఆ వున్న రెండెకరాల్లో పైరు వేసుకోవడానికి నాలుగు రోజులు పట్టదు. తర్వాత ఏంచేస్తాడు ? పదిమందితో పాటు కూలికి బయల్దేరతాడు. కనుక కూలిపెరగడం అతనికీ లాభమే ! ఏమంటారు ?

గోపా : ఈవాదన తెగిచచ్చేదిగాదుగాని, ఈ యేటికి ఇట్లాగే పోనివ్వండిరా అబ్బాయ్. తర్వాత చూచుకుందాం.

పుల్ల: బాగానేవుంది. వెనకటి కెవడో చచ్చేదాకావుంటే పెళ్ళి చేస్తానన్నాడంట.

రామ : ఉండరా.

పుల్ల : ఏంటి వుండేది. ఏ యేటికాయేడు యిట్టాగే పోతావుంది.

గోపా : (చురచుర చూస్తూ) ఎవరిమీందరా నీ అదరిపాటు ?

మొహ : గోపాలరావుగారూ ! నిజానికి పుల్లయ్య మాట్లాడిన దాంట్లో అదరిపాటేముందండీ ? శంకరయ్యగారు కూతురు పెండ్లికి పదివేలు కట్నమిచ్చారు. అయిదువేలు ఖర్చు పెట్టారు. అందువల్ల నాలుగువేలు అప్పయ్యిందేమో; అదీ వ్యవసాయ ఖర్చులకింద లెఖ్ఖేనా ?

సూర : జానయ్యగారి సంపాదన కొడుకు చదువుకింద చాలటం లేదంట; ఇంకేం చెప్తాం !

రామ : అయ్యన్నీ మన కెందుకుబాబూ ! ఆరిచేవాళ్ళమా ? తీరిచేవాళ్లమా !

మోహ : ఏ వస్తువు కొనబోయినా మండిపోతూంది. కూలీలు పుప్పుదగ్గరనుంచీ కొనుక్కోవలసిందే ! చెమటోడ్చి కష్టపడ్డా కడుపు నిండడంలేదు. వాళ్ళు పనిచేయాలంటే అసలు బతకాలిగా !

శంక : (కోపంగా) నువ్వు కూలికెళ్ళేవాడివా పెట్టేవాడివా. అసలు నువ్విక్కడి కెందుకొచ్చావురా అబ్బాయ్ ?

గోపా : మనం దేని కెంత ఖర్చుపెడతన్నామో లెఖ్ఖచెప్ప డానికి. (రాముడు వస్తాడు)

పుల్ల : అంతేలెండి ! ఎవరికైనా వుండమాటంటే వులుకెక్కువ.

గోపా : ఒరేయ్ ! జాగ్రత్తగా మాట్లాడు.

రాము : అస లీడిదగ్గిర ఎంత పొగరుందని.

పుల్ల : ఏంటయ్యో ! మాటలు సరిగా రానియ్.

రాము : ఏంటిరా ఇప్పుడు కూసినకూత మళ్లీ కుయ్ ?

(అంటూ మీదకు వెళతాడు)

పుల్లి : ఏం? కొడతావా?
సూర : కొట్టాలి రెండు సీసాలు.
(రాముడు సూరయ్య వంక కొరకొర చూస్తాడు)
గోపా : (మందలింపుగా) అరే, రాముడూ!
రాము : కాదుండీ మన బంజరు దున్నుతారంట. బంజరు!
సూర : ఏం దున్నితే? నీతాత సంపాయించాడా?
రాము : ఉఁహు.
గోపా : అరే. నీకెందుకురా ఆ గొడవ?
రాము : అది కాదుండీ.
గోపా : పోరా అంటే. (కసురుకుంటాడు)
రాము : చిత్తం, (వెళతాడు)
(శంకరయ్య, జానయ్యలు లేస్తారు)
శంక : (లేస్తూ) గోపాలరావ్! మేం వెళతాం.
రామ : మాగతి ఏంజేసి వెళతన్నారు!
జాన : వెళ్ళక, పొద్దుగూకులూ ఇదేపనా మాకు. (వెళతాడు)
రామ : (శంకరయ్యతో) మరా బంజరు మాటేంటిబాబూ?
శంక : ఏది చేసినా గోపాలరావు చెయ్యాలిసిందే. అతనితో పాటు మేమూ (వెళతాడు)
మోహా : విన్నారా గోపాలరావుగారూ?
గోపా : ఏఁవిటోయ్ మోహన్! చదువుకున్నవాడివి. నీవు కూడా గ్రహించకుండా మాట్లాడతావ్! వాళ్ళ కసలు ఏది చేయడానికీ ఇష్టంలేదు. వీళ్ళ పోరు పడలేక ఇక్కడిదాకా వచ్చారు.
మోహా : అలాగా! (లేస్తాడు)

సూర : డబ్బు లేకపోయినా, మాకూ కాస్త బుద్ధుంది (కూలీలతో)
పదండి పోదాం. (అంతా బయలుదేర్తారు)

పుల్ల : నేను వచ్చేటప్పుడే చెప్పా. ఇ దింతేనని.

రామ : (గోపాలరావుతో) పోతాం దొరా! (అంతా వింగులోకి పోతారు)

గోపా : ఇదిగో సూరయ్యా! సూరయ్యా! (సూరయ్య తిరిగి వస్తాడు)

సూర : పిల్చారా! ఎందుకు ?

గోపా : ముందు కూర్చో. (కుర్చీ చూపుతాడు)

సూర : ఫరవాలేదు లెండి.

గోపా : పిల్లిని చంకన బెట్టుకొచ్చా రెందుకు ?

సూర : (యోచిస్తూ) మోహనరావు వచ్చాడనా ? రాకపోతే ఇంకోరకంగా మాట్లాడతారు.

గోపా : నే ననేదీ అదే. అప్పుడు తప్పకుండా బండి గాడిని పడేది.

సూర : గాడినెందుకుపడేది! మాకు దేశం పరిస్థితులు తెలియవుగా.

గోపా : ఏం తెలియకపోతే! అంతా తెలిసినవాళ్ళే వుంటారా ?

సూర : తెలిసినవాణ్ణి తీసుకురండి, మాట్లాడదాం అనేవారు.

గోపా : అదిగాదయ్యా, నాతో మాట్లాడడాని కెవరొచ్చినా వర్వాలేదు. పెద్దవాడు, ఆ శంకరయ్యగా రున్నారు. గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిందని, ఆయన్ని వీడు విమర్శించడమా! నిజానికి ఆయన కెంతబాధగా వుంటుందో నీవే చెప్పు.

సూర : ఇంతకీ కూలి పెరక్కపోవడానికి కారణం మోహాన రావు రానటమేనంటారు !

గోపా : ఒకరనడం ఎందుకు, నీకు కనిపించడంలా ?

సూర : అందుకనే నింద లేంది, బొందిపోదన్నారు పెద్దలు.

(రాముడు వింగులో నిలచి సంభాషణ వింటూవుంటాడు)

గోపా : అదట్లావుంచు, నీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడా లని పిలిచాను.

సూర : చెప్పండి.

గోపా : మొదటినుంచి మీది చాలా పౌరుషంగా బ్రతికిన కుటుంబం. నీవుకూడ ఆ వాసన పోకుండా కాపాడుతున్నా వనుకో....

సూర : అందుకనే వున్న కొంద్ర కాస్తీ వూడిపోయింది.

గోపా : నెధవఆస్తి ఇవ్వాళుంటుంది, రేపుపోతుంది. దాని లెఖ్ఖేవిటి. గౌరవం కాపాడుకోవాలి. గౌరవం ! నీ వా సన్యాసులతో కలసి కూలికి వెళుతున్నావంటే, నాకెంత బాధగావుంది.

సూర : నాకు లేనిబాధ మీ కెందుకులెండి !

గోపా : నీకు బాధలేదంటే నమ్ముతానా ! నా భూమిలో నీ ఇష్టంవచ్చినచోట పదెకరాలు చేసుకో.

సూర : ఎందుకులెండి నాకు, ఎద్దా ! మొద్దా !

గోపా : దానికేం, మన చిన్నగిత్తల్ని తోలుకెళ్ళు. కాస్త తలాడిస్తవనేగాని, చాలాబాగా పోతయ్. నీకు తెల్సుగా, మిగతా పెట్టుబడంటావా ? పట్టుకెళ్ళు. నెమ్మదిగా తీర్చుకో వడ్డీలేకుండా.

సూర : ఇచ్చినా ఇయ్యకపోయినా, ఇచ్చినంత మాటన్నారు. సంతోషం పోతా. (వెళుతూ వుంటాడు. గోపాలరావు కోపంగా చూస్తూవుంటాడు.)

రాము : (కాఫీగ్లాసు గోపాలరావుకు అందిస్తూ) పుకక్కకు నెయ్యా కూడు యిమడదమ్ లెండి.

గోపా : (కాఫీతాగి గ్లాసు టేబిలుమీద పెడుతూ) ఊఁ.

(చంద్రయ్యను తీసుకుని రంగయ్య వస్తాడు)

గోపా : ఓహో ! మీరా ! రండి, రండి (కుర్చీచూపుతూ కూర్చోండి)

రంగ : (కూర్చుంటూ చంద్రయ్యతో) కూర్చోండి. (గోపాలరావుతో) మన సూరయ్య పెదతండ్రి కుమారుడు.

గోపా : ఇందాక చెప్పారే ... ఆయనా ?

రంగ : అవును.

గోపా : (చంద్రయ్యతో) మీ పరిస్థితులన్నీ రంగయ్యగారు చెప్పారూ....

రంగ : ఇదిగో ! చంద్రయ్యగారూ ! మీ కథ విని గోపాలరావు గారు కరిగిపోయారంటే నమ్మండి. అంతేగాదు, మీకు జీవనోపాధికూడా కల్పిస్తామన్నారు.

చంద్ర : ఏదో వారి దయ.

గోపా : నాకు భగవంతుడేదో యింత యిచ్చాడు. కనీసం మీలాంటివారికి సహాయపడటం నాధర్మం.

రంగ : చూచారా ! చంద్రయ్యగారూ ! ఎంత వుదారస్వభావమో !

చంద్ర : చెప్పాలా !

గోపా : దానికేం గాని. అసలు విషయం తేల్చండి. మీకు మా తోటదగ్గర వుండడం అంగీకారమేనా ?

రంగ : ఆఁ ఆఁ, లేనిదే నాతో వస్తారా ?

గోపా : సరె, ఇంకా రెండు సంవత్సరాలు మొక్కల్ని జాగ్రత్తగా పెంచాలి. ఏమివ్వమంటారో చెప్పండి ?

చంద్ర : తమరే సెలవియ్యండి.

గోపా : నాకే పెట్టారు !

రంగ : మంచికి మంచే, వ్యవహారానికి వ్యవహారమే. మీరివ్వదలచుకున్నదేదో చెప్పండీ !

గోపా : ఈ రెండేళ్లూ సక్రమంగా పనిచేస్తే, రెండెకరాలపొలం ఇస్తాను. రెండెకరాలు. (చంద్రయ్య ఆశతో గోపాలరావు వైపు చూస్తాడు) ప్రస్తుతం బీడుగావుంది. ఎక్కడంటారేమో మా తోటకంటె కాస్తదూరం.

చంద్ర : దూరమో, దగ్గరో, అది తరవాతసంగతి. ఈ లోపల మా జీవనం ?

రంగ : ఆలోచించాల్సిన విషయమే.

గోపా : (చంద్రయ్యతో) మన బావిచుట్టూ పదిసెంట్లు ఖాళీస్థలం వుంది. అందులో కూరగాయలువగైరా పండించుకోండి. తోటలో పనిలేనప్పుడు యితరత్రా సంపాదించుకోవడానికి నా అభ్యంతరం లేదు.

రంగ : విన్నారుగా చంద్రయ్యగారూ ! ఏఁవంటారు.

గోపా : ఆఁ, మరచాను. రాత్రిళ్లు మీకు తోటదగ్గరే పడుకోవాలి. అక్కడ చక్కని పాకకూడా వుంది.

రంగ: అంతేనా! మంచం, కంబళి, దిండు, తాబేటికాయ ఇవన్నీ వుండాలేమో.
గోపా: అన్నీ వున్నై.
చంద్ర: అట్టాగే పడుకుంటాలెండి.
గోపా: అసలు మీ కుటుంబ మెంతమంది?
రంగ: పాపం! కుటుంబమంతా ఛిన్నాభిన్న మైంది.
గోపా: ఏంచేస్తాం లెండి.
రంగ: మిగిలిందల్లా ఒక్క కుమార్తె; ఒక గిత్తదూడ.
గోపా: ఓ, మావద్ద తల్లిచావు కోడెదూడ ఒకటి వుంది; ఇస్తాను, మేపుకుంటారా చంద్రయ్యగారూ? (చంద్రయ్య సంతోషంగా తలూపుతాడు) అదిగో! అక్కడుంది వెళ్ళి చూడండి. (చంద్రయ్య బయటికి వెళతాడు)
రంగ: మనిషి చాలా మంచివాడు లెండి!
గోపా: సూరయ్యమాటల్లోపడి జారిపోడుగద.
రంగ: జారటం మాట లేనా! మీరు వేసిన ఎరెట్లాంటిది–భూమి. భూ ... (చంద్రయ్యని చూసి ఆగిపోతాడు)
గోపా: (చంద్రయ్యతో) ఆఁ, చూశారా?
చంద్ర: కాకులుపొడిచి ఒంటినిండా పుళ్ళుపడ్డయ్ దూడకు. పురుగులుకూడా పడ్డయ్యనుకుంటా.
గోపా: మంచి కోవగల దూడ. దీని అన్న అయిదు వంద లమ్మింది.
చంద్ర: దాన్ని బతికించటానికి పడగల పాట్లన్నీ పడతా. సాయంత్రం తోటకాడికి కెళ్ళేటప్పుడు తీసుకెళతాలెండి. రంగయ్యగారూ! వెళదామా.

రంగ : పదండి, నాకూ తొందరపనుంది.

చంద్ర : (గోపాలరావుతో) వెళ్ళొస్తానండి.

గోపా : అట్లాగే. (అంతా లేస్తారు)

( తె ర )



# భూమికోసం

## మూడో రంగం

### రచ్చబండ

[శంకరయ్య రచ్చబండమీద కూర్చునుంటాడు. గోపాలరావు అటూ, యిటూ పచారుచేస్తూ వుంటాడు. పుల్లయ్యా, రామదాసూ నిలబడి వుంటారు]

గోపా : అరే! పుల్లాయ్! మర్యాదగా అడుగుతున్నాను, దొంగతనం ఎప్పుడూ దాగదు. ఇవ్వాళ కాకపోతే రేపైనా బయటపడి తీరుతుంది. ఆనాడు నీ చావు కుక్కలొల్లవు. బతకదలిస్తే నిజంచెప్పు; మా దొడ్లో దొంగతనానికి వచ్చింది ఎవరెవర్రా ?

పుల్ల : ఏమో! ఎవడు చచ్చాడో నాకేం తెలుసండీ! అట్టాంటి ఎదవబుద్ది నాకు లేదుసరిగదా.........

గోపా : నాలుగురోజులక్రితం యిక్కడే పెద్దమనుషుల ఎదుట నీవు నేరంచేసినట్లు రుజువైంది. ఒకడూ, ఇద్దరూకాదు; నలుగురు సాక్ష్యం చెప్పారు...

పుల్ల : ఆళ్ళూ మనుషులే.

గోపా : కాదు నీవే మనిషివి — అప్పుడు నిన్ను పగత్రీసి ఎండేసినా అడిగే దిక్కులేదు. అయినా నాలుగు రోజులు గడువిచ్చాను. ఎందుకిచ్చానో ఏంవిటో ఆలోచించి మరీ జవాబుచెప్పు.

పుల్ల : ఏం చెప్పమంటారండీ ?

శంక : అరే ! పుల్లాయ్. పసిబిడ్డకు చెప్పినట్టు చెప్తున్నాడు. తలతిక్కగా వాగి గోపాలరావును రెచ్చగొట్టకు. తెలిసో తెలియకో గడ్డి తిన్నానని ఒప్పుకో. తేలికలో పోతుంది.

రామ : ఇంతప్పట్నుంచి పుల్లాయి నెరుగుదును. నాలుగేళ్ళు మీదగ్గర కమతంకూడా చేశాడు. ఎన్నడైనా యీడిదగ్గిర దొంగబుద్ధున్నట్టు చూశారూ ? చెప్పండి దొరగారూ.

గోపా : చూస్తే యీచికిత్స అప్పుడే జరిగేది. బయట పడనంత కాలం అంతా బుద్ధిమంతులే !

పుల్ల : అవున్లెండి.

శంక : ఎప్పటి సంగతో ఎందుకు ? ఇప్పుడిది తేలనివ్వండోయ్!

గోపా : మాటల్తో తేలుతుందీ ?

రామ : చేసినమాట నిజమయితే తేలకేం చేస్తుంది బాబూ !

శంక : ఏమీచెయ్యంది ఎందుకంటారోయ్. నిన్ననరేం ?

రామ : అదిగాదండి. ఆరోజు పొద్దుగూకులూ మేమిద్దరం ఒక్క చోటే వుండాం. మాకొంప పడిపోతే కట్టుకుంటున్నాం.

గోపా : ఒహో ! అదా సంగతి ! అయితే యిందులో నీకూ భాగముందన్నమాట ! సరి సరి !

పుల్ల: ఇంకేం. ముసలాణ్ణికూడా యిందులో యిరికించండి. మీాపున్నెం ఎక్కడికి పోతుంది.

శంక : ఛఛ ! వాగబోకు. ఈయన మీామీద కేసులు బనాయిస్తున్నాడంటావా ?

పుల్ల : అదికాదండీ. ఏటినర్గంనుంచి దొరగారు మామీద కచ్చి పట్టారు. చివరికి యిట్టా తీర్చుకుంటున్నారు.

శంక : నోటికొచ్చినట్లు వాగి తన్నులు తినేవు.

గోపా : తిప్పి తిప్పి అమ్మితే గుడ్డిగవ్వ ఖరీదు చెయ్యదు. వీడి మీద కక్ష తీర్చుకోడానికి ఓ ప్రయత్నం చెయ్యాలట. పక్క విరగదన్నే వరకూ యిట్లాగే వదరుతూంటాడు.

రామ : అంత పనెందుకులే బాబూ.

గోపా : ఎందుకని వూరుకోబట్టి యిష్టంవచ్చినట్లు గంతులేస్తున్నారు. అసలు నీలాంటి పెద్దవాళ్ళకి బుద్ధుంటే, వీళ్ళిట్లా ఎందుకు తయారవుతారు ? (పుల్లయ్యని వేలితో చూపుతూ) వీడి బ్రతుకెంత ? వీడెంత ? చేసిన తప్పు చాలక నన్నెదిరించి మాట్లాడుతాడూ ?

శంక : తల్లో పొగరు.

పుల్ల : పొగరంట, పొగరు ! ఏం తిని పొగరెక్కిందండి ?

గోపా : (కోపంగా) ఏమిట్రా పేలుతున్నావు ?

రామ : బాబూ ! తిక్కసన్నాసి. తెలిసాకమాట. తెలియకోక మాట.

గోపా : చెట్టుకంటకీసి నాలుగు తన్ని తేసరి. తిక్కా గిక్కా వొదిలిపోతుంది.

(సూరయ్య, మోహనరావుల ప్రవేశం)

సూర : (పైమాటలు విని) మీరు తలుచుకుంటే ఆగుతుందీ ? తేరగుర్రం తంగేడుబరికె. తన్నండి, తన్నండి !

గోపా : ఎందుకు తన్నుతారూ ?

మోహ : అది మీకే తెలియాలి.

గోపా : మీకు తెలియదంటావు ?

శంక : నీకు తెలియకపోవడం ఏమిట్రా అబ్బాయి !

సూర : మాకుకాదు, దేవుడికూడా తెలవ్వ గోపాలరావు గారి ఎత్తులు.

గోపా : హిం ! హిం ! ఏమీ తెలియందే అలగాజనాన్ని రెచ్చ గొట్టి వూరుమీంది కెగదోల్తున్నారూ ?

శంక : భేసైనమాట చెప్పావు. లేకపోతే ఎన్నడన్నా ఎరుగుదుమా ? ఇట్లాంటి దొంగతనాలు. ఊళ్ళో అలుసుకని పెట్టి కాదూ వీళ్ళకి కాళ్లొచ్చినై.

సూర : మీరు పూనుకొన్నారుగా ! యిరగ్గొట్టడానికి.

(జానయ్యని తీసుకొని రాముడు వస్తాడు)

శంక : అదికాదురా అబ్బాయి. నీవూ సంసారిపుట్టుక పుట్టావు. ఈ మాటచెప్పు. గోపాలరావుగార్లో జొరబడి బంగారం లాంటి ఆవుపెయ్యని తోలుకెళ్లి కటికివాడికమ్మటం మంచిదే నంటావా ?

సూర : ఆసంగతి బండరాముణ్ణి అడగండి.

గోపా : వాడి కేం తెలుసు?

మోహ : తోలిపెట్టిన మీకూ, తోలుకెళ్లిన మీ రాముడికీ తెలియకపోతే యింకెవరికి తెలుస్తుందండీ !

గోపా : మర్యాదగా మాట్లాడు.

మోహ : మర్యాద ! నిరుడు కూలీలు పావలాకూలీ పెంచమంటే పెంచనన్నారు. గత్యంతరంలేక సమ్మెచేస్తే రెట్టింపు కూలిచ్చి పొరుగూరినించి కూలీలని దించారు. ఇప్పుడా కక్ష సాధించడానికి రాముడితో ఆవుపెయ్యని అల్లుడిగారింటికి తోలిపెట్టి, మమ్మల్ని జైలుకు పంపాలనుకున్నారు.

రామ } : ఆఁ! అట్లాగా!
పుల్లి }

సూర : అదంతా మర్యాదస్థుల లక్షణం లే.

గోపా : చాల్లే! అంతటితో ఆపు. సంతోషించాం మీ తెలివికి. ఇదంతా పచ్చి అబద్ధం.

రాము : దొడ్లోనే వుందండి ఆవు పెయ్య!

గోపా : దొడ్లోనా!

రాము : సూరయ్యగారు తోలుకొచ్చి, తోలేరండి.

గోపా : ఆఁ! అట్లాగా! (గుక్క తిప్పుకొని) ఏం జానయ్యా! మనవాళ్ళ తెలివితేటలు చూశావా! చేసినపాపం బయటపడుతుందనుకున్నారు. దొంగను తేలుకుట్టినట్లు ఆవు పెయ్యని తోలుకొచ్చి దొడ్లోతోలారు. ఈమాత్రానికే విడిచిపెడతానూ? మా అల్లుణ్ణి పిలిపించి వీళ్ళబండారం బయటపెట్టితీర్తాను. నాదగ్గరా! ఈ పిచ్చి వేషాలు. వస్తా శంకరయ్యగారూ. (లేస్తాడు)

శంక : పదండి. (తనుకూడా లేస్తాడు)

సూర : (శంకరయ్యతో వ్యంగ్యంగా) వెళ్ళి రండి.

శంక : వెళతారా అబ్బాయ్.

సూర : చిత్తం.

మోహ : గోపాలరావుగారూ! మీరు చాల గొప్పయెత్తే వేశారు. కాని అది ఫలించలేదు. చేసిన పాపాన్ని ఎంత జాగ్రత్తగా సమర్థించుకున్నా అతగలేదు. ప్రజలు మేలుకున్నారు. మీ కుట్రలూ, కుతంత్రాలూ బయట పడి

పోతున్నాయి. ఇది మీ రెంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది, వెళ్ళరండి !

గోపా : (వికటంగా నవ్వి) చదువుకున్నందుకు మంచి తెలివి తేటలు సంపాదించావు. కాస్త జాగ్రత్తగా మాట్లాడ్డం నేర్చుకో. నీలాంటివాళ్ళని చాలామందిని చూశాం. (గోపాలరావూ, రాముడూ వెళతారు)

సూర : ఆ నవ్వులోవుందీ, ఏంవుండా ?

పుల్ల : విసం.

రామ : (సూరయ్యతో) ఇంటికాడ చెప్పకుండా ఎక్కడికెళ్ళాడబ్బా అని నిన్నట్నుంచీ కొట్టుకుంటున్నాం. ఈ పనిమీదుండావా బాబూ !

జాన : గోపాలరావుగారు ఆవుపెయ్యని అల్లుడుగారింటికి తోలి పెట్టాడని నీ కెట్లా తెలిసింది సూరయ్యా ?

సూర : బండరాముడిజతను తిరుగుతావ్ఁటాడే. . .

రామ : ఎవడు ? ఆ మూఁడుముంతలాడా ?

సూర : ఆఁ! ఆ సన్నాసే.

పుల్ల : ఆఁ ! ఆఁ !. . . . . . . . .

సూర : నిన్నసాయంత్రం చెరువుగట్టుమీద ఎదురుపడి యీ కథంతా చెప్పాడు.

జాన : వాడు నీకెట్లా చెప్పాడూ ?

సూర : తాగుబోతు ! వాడిదేముంది ? రెండురూపాయిలు చేతిలోపెడితే అదంతా చెప్పేడు. సరేనని అదేదారిని గోపాలరావుగారి అల్లుడుగారి వూరికి బయలుదేరాను.

ఒదిలిపెడితే ప్రమాదమని మూడు ముంతలాణ్ణికూడా నాతోనే తీసుకెళ్లా.

జాన : తెలివైనపని జేశావు.

సూర : అక్కడ వూరిబయట మిగతా ఆవుల్లోకలిసి యిది కూడా మేస్తావుంది. సమయానికి ఆ గొడ్డుకాడా డేమయ్యాడో, ఎటుచూచినా కనపడలా. అదేమిదేమని మొదలకుండా తోలుకొచ్చా.

పుల్ల : బలే ధైర్యంచేశావు సూరయ్యగారు.

రామ : కాని దాన్ని అక్కడేవుంచి జానయ్యగారంటి పెద్ద మనిషిని తీసికెళ్లి చూపించినట్టయితే బాగుండేదేమో ?

మోహ : ఏమైనా జరిగేదింతే. ఇప్పుడు నాదొడ్లో తోలింది మీరేనన్నాను. అప్పుడు అల్లుడుదొడ్లో తోలిందీ మీరే అనేవాడు.

జాన : అదీ నిజమే. పుల్లాయి దొంగతనం చేశాడంటే నాకు మొదటినుంచీ నమ్మకం చాల్లేదు.

మోహ : మీరీమాట గోపాలరావుగారుండగా అనవలసింది.

జాన : ఏఁవంటాం !

సూర : అంతేలెండి. (మిగతా వాళ్ళతో) పదండి, పోదాం. చచ్చే ఆకలవుతావుంది.

రామ : పదబాబూ. నడిచి నడిచొచ్చావు.

పుల్ల : పొద్దుట్నించీ యిక్కడే పడేసుంచారు. మేమూ తిన్లే.

మోహ : సరే ! పదండి. భోజనంచేసి మాట్లాడుకుందాం.

( అంతా బయలుదేర్తారు. )

జాన : (మోహన్‌తో) వెళ్ళొచ్చులే. నువ్వుండరా అబ్బాయి.

( మోహన్, జానయ్యాలు తప్ప మిగతావారు వెళతారు. )

మోహ : ఎలాగండీ యీ గోపాలరావుగారితో.

జాన : ఇవ్వాళ కొత్తేముంది ? మొదటినుంచీ యింతేగా ! ఈయనవల్ల గ్రామంలో నష్టపడ్డవాడేగాని, బాగుపడ్డవాడొక్కడూ లేడు. మా పినతండ్రి కొడుకు రామారావు మాటంటే పడేవాడుకాదు. గోపాలరావు వాణ్ణి కోర్టుకీడ్చి సర్వనాశనం చేశాడు.

మోహ : చూస్తూ వూరుకుంటే క్రమంగా అందరికీ అదేగతి పడుతుంది.

జాన : డబ్బుగలవాడిది రాజ్యం, ఏంచేస్తాం.

మోహ : మీరనవసరంగా భయపడుతున్నారు. మనం పది మందీ కలిసుంటే ఆయన చెయ్యగలిగిందేమీ లేదు.

జాన : సరేకానీ ! ఆ చేసేపని కాస్త జాగ్రత్తగా చేస్తూండండి.

(చంద్రయ్య ప్రవేశం, భుజాన పలుగు వుంది.)

మోహ : (చంద్రయ్యను చూచి) పొద్దు పడమరతిరిగింది, ఇంకా భోజనం చెయ్యలేదుగా ?

చంద్ర : లేదుబాబూ, గోపాలరావుగారిచ్చిన రెండెకరాల్లో మోడూ, మొద్దూ తీస్తున్నా.

జాన : అదొక అడివి. మీ రొక్కరూ చేస్తే ఏమవుతుంది ?

చంద్ర : చేస్తావుంటే అదేఅవుతుంది (వెళతాడు).

జాన : ఆ రెండకరాలకోసం యీాయన పడ్డకష్టం యింతా అంతా కాదు. అదయినా ఖరీదుగల భూమంటూావా ? అంతాకలిసి మూడొందలు చెయ్యదు.

మోహ : విలువకడితే ఏమవుతుంది. రైతుకు భూమిమీద వుండే అపేక్ష అలాంటిది.

జాన : ఆయనగాబట్టిగాని, మరొకడెవ్వడూ గోపాలరావుగారి తోటని రెండేళ్ళలో యింత బాగా పెంచగలిగేవాడు కాదు.

మోహ : అవును.

జాన : సరేగాని, మోహన్ యిది నిజమేనా?

మోహ : ఏమిటది?

జాన : చంద్రయ్యగారమ్మాయిని నువ్వు చేసుకోవాలనీ, మీ నాయనవద్దనీ ఘర్షణపడుతున్నారుటగా?

మోహ : అవును, ఆయనకు కట్నం వెర్రి.

జాన : అట్లా అనుకున్నా, యిప్పుడు చంద్రయ్యగారి దగ్గర రెండు వేలు ఖరీదుచేసే గిత్తలున్నాయి. పైగా యీ పొలంకూడా చేతికొచ్చింది.

మోహ : విషయం అదికాదండీ. అసలు పెళ్ళిచేసుకొనేది కట్నంకోసమా?

జాన : ఆ పిల్ల చాలా మంచిదని మా ఆవిడ చెప్తూంటుంది. 'అన్నీ తండ్రి గుణాలేనండీ' అని.

మోహ : పేదవాళ్ళ మంచితనం ఎవరికి కావాలండీ జానయ్య గారూ? (లేస్తాడు).

జాన : (లేస్తూ) ఏమన్నాగానీ, చేసుకోతగ్గ పిల్లేరా అబ్బాయి.

( తెర )



# భూమి కోసం

## నాలుగో రంగం

నారయ్య యిల్లు

[మంచం వాల్చివుంటుంది. ఒకమూల పలుగు, పార వుంటాయి. మధ్యలో ఒక స్టూలు, దానిమీద పుస్తకాలు, దండెంమీద బట్టలూ [వేలాడుతూ వుంటాయి. మరోమూల బియ్యంబుట్టా, పండ్లబుట్టా వుంటాయి. నిర్మల సరోజకు జడవేస్తూవుంటుంది. తెర లేస్తుంది.]

నిర్మ : (రిబ్బను వేస్తూ) మంచి రిబ్బను కొనుక్కోకూడదూ? మీ నాన్ననడిగి.

సరో : నే నెప్పుడూ మా నాన్ననడగను. నాకు యేది తెచ్చినా మాఅన్నయ్యే.

నిర్మ : ఇంకేం, మీ అన్నయ్యనే అడుగు.

సరో : ఎన్ని తెమ్మనన్నా? రెండు తెమ్మంటానేం?

నిర్మ : తెమ్మను, అన్నా చెల్లెలూ చెరొకటీ వేసుకోవచ్చు.

సరో : ఛీ, ఎక్కడన్నా మగాళ్ళు రిబ్బన్లువేసుకుంటారా! అందులో వొకటి నీకు.

నిర్మ : (రిబ్బను వేయడం పూర్తిచేసి ముద్దుగా సరోజ బుగ్గమీద కొట్టి) సరేగాని సరోజా! మొన్న మీయింటికి చుట్టాలు వచ్చారు, ఎవరు?

సరో : వాళ్లు చుట్టాలుకాదు. మా అన్నయ్యకు పిల్లనివ్వడానికి వచ్చారు.

నిర్మ : ఊఁహుఁ.

సరో : కట్నం నాలుగువేలిస్తామన్నారట, మానాన్న ఎగిరి గంతేశాడు.

నిర్మ : సంబంధం కుదిరిందన్నమాట !

సరో : కుదిరేదే ! మా అన్నయ్య ఒప్పుకోలా.

నిర్మ : మరి మీ నాన్నగారూరుకున్నారు ?

సరో : ఎందుకూరుకుంటాడు. (తండ్రిలాగ నటిస్తూ) "అరే అబ్బాయ్ ! నాలుగువేల రూపాయల కట్నం. పిల్ల వంటిమీద బోలె డన్ని నగలున్నయ్, యెందుకు పోగొడతావ్ ! నామాట విను నాయనా" అన్నాడు.

నిర్మ : అంటే మీ అన్నయ్య ఏమన్నాడు ?

సరో : మా అన్నయ్యా ! నాన్నా ! "పెళ్ళికి ప్రేమప్రధానం గాని డబ్బుగాదు. ఇది నా జీవితసమస్య; మీరు అంత పట్టు పట్టడం న్యాయంకాదు" అన్నాడు. అప్పుడు మా నాన్న (దూరంగా వెళ్ళి తండ్రివలె పోజుపెట్టి) "మోహన్ ! ఏఁవిటి నీకీ వెర్రి. నాకంటే నీమేలు కోరేదెవరు ? పెండ్లికి ప్రేమ ప్రధానమని నాకూ తెలుసు. శుభ్రంగా నేనుచెప్పినప్రకారం పెండ్లి చేసుకొని ప్రేమించు, ప్రేమించరా, నీ భార్యను ప్రేమించు. ఎవరు కాదన్నారు అన్నాడు. నాకు బలే నవ్వొచ్చింది వదినా." (నిర్మల పైటకొంగు నోటికి అడ్డం పెట్టుకొని నవ్వు ఆపుకుంటూ వుంటుంది చివరకు నిర్మల, సరోజ విరగబడి నవ్వుతూ వుంటారు ).

కనక : (ప్రవేశించుతూ) నిర్మలా ! నిర్మలా ! (ఆమె పిలుపు వినగానే యిద్దరూ నవ్వు ఆపి అటు చూస్తారు. కనకమ్మ ప్రవేశించుతుంది.)

నిర్మ : ఏఁవిటి పిన్నీ ?

కనక : ఇంటో పాలుగాక యింకో రెండు శేర్లు చాలూ ?

నిర్మ : పాలా, ఎందుకు ?

కనక : చాల్తయ్యా చాలవా ? ఆ అజలన్నీ నీ కెందుకు ?

నిర్మ : (తలగోక్కుంటూ) పాలా, పాలు !

కనక : నీకు తెలవదులే. వెళ్ళి తొందరగా పొయ్యిరాజెయ్. ఇప్పుడేవస్తా. (వెళుతూవుంటుంది)

సరో : ఎక్కడికి అత్తయ్యా ?

కనక : ఆ మాట అడగొద్దని ఎన్నిసార్లు చెప్పాలి నీకు, పని మీదెళ్ళేటప్పుడు (మరి రెండడుగులు వేస్తుంది. నిర్మల సైగచేయగా సరోజ కనకమ్మకు అడ్డం తిరిగి ఆమెను కౌగలించుకుని)

సరో : అత్తయ్యా ! చెప్పవూ ?

కనక : పిచ్చిపిల్ల, కోఁవటింటికమ్మా ! మా నిర్మళ నాన్న చెమట దారపోసి గోపాలరావుగారికి కోటపెంచిపెట్టారు. అందుకని ఆయన రెండెకరాలుకొండ్ర యిచ్చాడు. బావ గారికి సగ్గుబియ్యం పరమాణ్ణం అంటే ఎంతోపేణం. పదేను రోజులనుంచీ కాద్దామంటే పడిసావలా. ఇయ్యాల గాయాలి.

నిర్మ : (సంతోషంగా) అంతా నాన్నకేనా, మాకూ్కడ యేమన్నా వుందా ?

కనక : ఆయన తాగ్గా మిగిలితేనే యెవరికైనా (సరోజతో) రావే పిల్లా ఎల్దాం. (సరోజను లాక్కొనిపోతూవుంటుంది. సరోజ నిర్మలవైపు చూస్తూ వెళుతుంది. నిర్మల నవ్వుతూ పాట పాడటం ప్రారంభిస్తుంది.)

పా ట

భూమీా, ఎద్దులు వుంటే చాలు,
ఏమీాకోరడు సౌకర్యా లిం
కేమీా కోరడు సౌఖ్యాలు ॥భూమీా॥

పోడో, బీడో సరిజేస్తాడు
చెమటనీటితో తడిపేస్తాడు
నాగలిపన్ని, భూమిదున్ని, ఆ
నందంగా పైరేస్తాడు ॥భూమీా॥

నవరస ఫలములు, నవధాన్యాలు
సువిశాలావని కందిస్తాడు
నవ్యమార్గమున, నడచి దేశమున
సర్వసంపదలు నింపేస్తాడు. ॥భూమీా॥

(పాట మధ్యలో మోహనరావు ప్రవేశిస్తాడు. వింగులో నిలబడి పాట విని ఆనందిస్తూవుంటాడు. పాట పూర్తవుతూండగా లోనికి వస్తాడు. నిర్మల అతన్నిచూచి సిగ్గుపడుతుంది.)

మోహ : చాలా బాగుంది.

(నిర్మల జవాబు చెప్పకుండా లోనికి వెళ్ళబోతుంది)

మోహ : ఏం, నిర్మలా !

నిర్మ : (పైటకొంగు నలిపివేస్తూ పెగిలీ పెగలని గొంతుతో)ఏ...వి...టి మోహన్ !

(కొంతతడవు యిద్దరూ మౌనంగా నిలచిపోతారు)

మోహ : ఆఁ, ఏం లేదు. మానిర్మల రాలేదా? (నాలుక కరచుకొని నవ్వుతూ) అ...అ...అ...కాదు, కాదు–సరోజ.

నిర్మ: (ముసిసిపోతూ) పిన్నితో కోవటెంటి కెళ్ళింది.

మోహ: ఒహో, అలాగా (వెనుకకు తిరిగి రెండడుగులు వేస్తాడు. ఆమె వెళుతూన్న మోహన్ వైపు చూస్తుంది. మోహన్ తల వెనుకకు తిప్పి నిర్మలవైపు చూస్తాడు. ఇద్దరి చూపులూ కలుస్తాయి. నిర్మల సిగ్గుతో తలవంచుకొని లోనికి వెళుతూవుంటుంది.)

మోహ: సూరయ్యమావ యెక్కడికెళ్ళాడో?

నిర్మ: (నిలబడి) తెలియదు.

మోహ: సరే. (వింగువరకూ వెళతాడు)

నిర్మ: రాగానే బాబాయ్‌తో ఏమైనా చెప్పమంటారా?

మోహ: (వెనుకకు తిరిగి మెల్లగా నిర్మలవైపు అడుగులు వేస్తూ) ఆఁ, ఏం లేదు. ఆయన్నేదో అడగా లనుకున్నాను.

నిర్మ: (తలవంచుకుని) అడగాలా! కావలసిందేదో తీసుకెళ్ళండి.

మోహ: అడక్కుండా తీసుకెళ్ళితే దొంగతనం అంటగట్టరూ!...

(పొట్లాలతో కనకమ్మ, సరోజల ప్రవేశం)

కనక: మాయింటికాడ దొంగతనంయేంటి నాయనా? నీకు కావలసిందేదో నేరుగానే పట్టుకుపో. ఎవరు కాదన్నారు.

మోహ: నిర్మల ఏదో అంటుంటేను...

సరో: అనరూ, దొంగతనంచేస్తే వూరుకుంటారూ?

మోహ: వూరుకుంటారా? జైల్లో పెడతారు.

సరో: జైలే! ఎన్నాళ్ళొదినా?

నిర్మ: (కనకమ్మ, సరోజల చేతుల్లో వున్న పొట్లాలు తీసుకుని లోనికి వెళుతూ) జన్మఖైదు.

సరో: (వింగులోకి చూస్తూ) నే నెప్పుడన్నా మా అన్నయ్యను చూడ్డానికొస్తే చూడనిస్తావా వదినా?

కనక : అయ్యో! నీ పిల్ల బంగారంగాను, పుడతాకొన్ని, పుట్టకకొన్ని. (అంటూ ఆప్యాయంగా మెటికలు విరుస్తుంది.)
నిర్మ : (లోపలనుంచి) పిన్నీ !
కనక : ఆఁ!
నిర్మ : పొయ్యి మండిపోతూఉంది ?
కనక : వస్తన్నా (రెండడుగులువేసి) అబ్బాయ్ వుండు వెళ్ళేవు.
మోహ : ఎందుకు ?
కనక : పనుంది చెప్పుతావుండు. (సరోజను తీసుకొని గబగబా లోనికి వెళుతుంది. సూరయ్య ప్రవేశించి, పై మాటలు వింటాడు.)
సూర : ఏరా, అబ్బాయ్! మొత్తాని కియ్యాళ వదో, నీ పెళ్ళుంది.
మోహ : సరేగాని, చంద్రయ్యమావఁ ఏడి ?
సూర : ఎర్రో! పాపో! రెండెకరాలు చేతికొచ్చింది. అందులోపడి కొట్టుకుంటన్నాడు.
మోహ : ఆయనకు భూఁవంటే యెంత అపేక్ష మావాఁ!
రామ : (ప్రవేశించి) ఎంత అపేక్షలేనిదే రెయ్యీ, పగలూం అనకుండా ఆ తోటలో పడుంటాడూ! పదెకరాల తోట, ఒక్కరెక్కమీద నీళ్ళుపోసి పెంచటం మాటలా !
మోహ : అవును ఒక రోజా! రెండు రోజులా! రెండు సంవత్సరాలు!
రామ : ఆయన పడ్డకష్టానికి గోపాలరావుగారు రెండెకరాలు గాదు, పదెకరాలిచ్చినా రుణం తీరదు.
సూర : పుణ్యాత్ముడు. ఏ గుణానుండాడో అనుకున్న దిచ్చాడు, అక్కడికి సంతోషించు.

(చంద్రయ్య వస్తాడు)

రామ : (చంద్రయ్యతో) మీా మాటే చెప్పుకుంటున్నాం. పొలం చేతికొచ్చిందో, లేదో అప్పుడే మొదలుపెట్టారూ పని!

చంద్ర : చేసుకోకపోతే ఎట్టా జరుగుతుంది రామదాసూ.

మోహ : చేసుకునేవాడికి భూమిలేదు. . .ఉన్నవాడు చెయ్యడు.

సూర : వాడి కేం గరుజుపట్టిందీ, మనబోటిరకమంతా వుండగా, చేసిపెట్టటానికి.

రామ : మంచిమాట చెప్పావు.

చంద్ర : అబ్బాయ్, మోహన్‌రావ్ ! ఎప్పటినుంచో, పేదాళ్లకి భూము లిస్తామంటన్నారు. ఏమయ్యిందది ?

సూర : ఇస్తానే వుండారు, వరసపెకారం.

పుల్ల : (వచ్చి) ఏం ఇచ్చేది ?

రామ : పొలమంట.

పుల్ల : పొలమా, పొలం! మనకూ-డా ఇస్తారా ?

సూర : ఆc, ఇస్తారు నీకూ, నాకూ రెండు దవడకాయలు. ఏం కష్టపడ్డావోయ్ నువ్వు దేశం కోసం ?

పుల్ల : వాఁయ్, నేను కష్టపడకపోవటమేంటి, నాకు చేతనయ్యిందేదో నేనూ చేశా.

మోహ : అలా అందరూ చేశారు. జైలుకువెళ్ళిన దేశభక్తులకే ఇప్పుడు భూములిచ్చేది.

సూర : అందులోకూడా తేడాలుండయ్.

చంద్ర : మళ్లీ యిదొకటా !

రామ : నిజమే. అక్కడెక్కడో బస్తీలో ఒకాయనకి స్థలం ఇచ్చారంట, ఇళ్లకు పనికొచ్చేది.

సూర : అట్లాంటియ్యన్నీ ఒకటోరకం మనుషులికి. అందాకా ఎందుకు, ఒకగంట జైల్లో వుండందుకు మన గోపాల రావుగారి కియ్యలా, అయిదెకరాల పాటి దిబ్బ !

పుల్ల : ఈయన రెండోరకవాఁ.

సూర : అదిగదీ.

మోహ : అనేకచోట్ల పేదలు సాగుచేసుకొనే భూము లూడ గొట్టి ఇలాంటి దేశభక్తులకిస్తున్నారు. అదేఁవిటంటే జైళ్లూ తుపాకులూ, కాల్పులు.

పుల్ల : కాలుస్తారు, కాలుస్తారు !

రామ : చేతిలో అధికారముందిగా, ఏదైనాచేస్తారు.

మోహ : అధికారాన్ని దుర్వినియోగంచేసి ప్రజలను హింసిస్తే దాని ఫలితం అనుభవిస్తారు.

చంద్ర : ఎందుకొచ్చిన గొడవబాబూ, ఈ రోజుల్లో శీరామ అంటం బూతుగావుంది. (లోనికి చూస్తూ) అమ్మాయ్ ! కాసిని మంచినీళ్ళు తీసుకురామ్మా. (సరోజ పెద్ద గ్లాసు ఒకటి రెండు చేతులతోనూ పట్టుకొని వస్తుంది.)

చంద్ర : (గ్లాసు అందుకొని చేతులు కాలగా కిందపెట్టి) ఇదేంటమ్మా ?

సరో : పరమాన్నం మాఁవయ్యా, పరమాన్నం !

చంద్ర : ఇదంతా నాకేనా ?

సరో : కాదు, చంద్రయ్యమాఁవకి !

(అంతా నవ్వుతారు. కనకమ్మ గ్లాసుల్లో పరమాన్నం పోసి యిస్తూ వుంటుంది. నిర్మల వింగులోనుంచి అందుకొని అందరికీ గ్లాసులందిస్తూ వుంటుంది.)

కనక : (వచ్చి) యేఁపాటుందీ అందులో, అది తాగలేరూ !

పుల్ల : ఏకులుపెడితే బుట్టలు చిరుగుతయ్యా, చంద్రయ్యగారూ! తాగండి, తాగండి.

రామ : (కనకమ్మతో) ఇయ్యాలేమైనా పండగా ?

సూర : ఆఁ, నేను పుట్టినరోజు పండగలే ! కానియ్.

కనక : అయ్యో రామ ! నా బొటుక్కి పుట్టినరోజు పండక్కాడా, సెంటు పొలం సంపాదించటం చేతకాలేదుగాని.

మోహ : ఆఁ, ఇప్పుడు తెలిసింది. చంద్రయ్య మాఁవ రెండెక రాలు పొలం సంపాదించాడుకదూ !

పుల్ల : అదా కత ! (ఖాళీ గ్లాసు కిందపెడతాడు. నిర్మల రెండవసారి వడ్డించబోతుంది)

పుల్ల : వద్దమ్మా, వద్దు.

(నిర్మల రామదాసుకు వడ్డించబోతుంది. అతడు గ్లాసు వెనక్కు లాక్కుంటాడు. మోహనరావు వద్దకు వెళుతుంది. అతను గ్లాసు పడతాడు. నిర్మల గ్లాసులో పరమాన్నం పోస్తూవుంటుంది. మోహనరావు ఆమె ముఖం లోకి చూస్తూవుంటాడు. గ్లాసులోని పరమాన్నం అయిపోయినా అలాగే పోస్తూవుంటుంది నిర్మల. సరోజ ఎడమచేయి నడుముకానించి ఆ యిద్దరినీ ఎగా, దిగా చూస్తూవుంటుంది. మిగతావాళ్లు యీ దృశ్యం చూసి, ముసిముసి నవ్వులు నవ్వుతూ వుంటారు.)

సూర : (కనకమ్మతో) ఇదిగో ! ఇంకా స్తి పరమాన్నం తెచ్చి ఆ గ్లాసులో పొయ్యవే.

(తెప్పరిల్లి నిర్మలా, మోహనరావూ సిగ్గుపడతారు)

చంద్ర : (నిర్మలతో) అమ్మా ! ఆ గ్లాసేది. (ఖాళీగ్లాసు తండ్రికి నిర్మల అందిస్తుంది. ఆయన తన గ్లాసులోని పరమాన్నం దానిలో కొంత పోసి సరోజకిచ్చి, మిగిలింది త్రాగుతాడు. సరోజ గ్లాసు కనకమ్మకు ఇవ్వబోతుంది.)

కనక : (చంద్రయ్య నుద్దేశించి) అందులో మళ్లీ కొంత తీశారా? (సరోజతో) సరే, మీ మామయ్యకియ్యి. (సరోజ అలా చేస్తుంది.)

సూర : (గ్లాసు అందుకుంటూ) మీ అత్తయ్య కుందో లేదో...

కనక : ఓ యబ్బ, ఏం దయ, తాగు తాగు. (కాళీగ్లాసు అందుకుంటుంది.)

సూర : సరె, తప్పుతుందీ, (గటగట తాగి గ్లాసు కిందపెడుతూ, సరోజతో) ఏఁయ్! పిల్లా, తియ్ గ్లాసులు, తియ్.

సరో : తాగినాడివి తీసుకో లేవ్రూ!

కనక : ఆ తిక్కలాయనతో నీకెందుకులే, పదమ్మా. మళ్లీ అది ఆరిపోతంది. (స్త్రీలు ముగ్గురూ లోనికి వెళతారు.)

రామ : రెండెకరాల కొండ్ర అమిరిందని ఇంత సంతోషపడతా వుంది. అందులో పండినపంట యింటికొచ్చినప్పుడు ఇంకెంత సంతోషపడతందో.

పుల్ల : ఎన్నాలు కొట్టుకుంటే ఆపర్ర పంటకు తిరగనూ!

చంద్ర : బోలెడంత పనుంది, అందులో నువ్వొక్కవుంటే!

సూర : ఉంటే బాగానే వుండును. ఏం బెట్టి తవ్విద్దాం?

చంద్ర : అదే మరి.

రామ : ఏంరా పుల్లయ్యా. మనకు ఆట్టే పనుల్లేవు. ఈ కాళీలో ముసలాయనకి బావి తవ్విపెడితే ...

చంద్ర : ఇంతవర్కాత్రం సాయంజేస్తే మీ మేలు మరచిపోను. తరవాత నెమ్మదిగా తీర్చుకుంటా, మీ కష్టం వుంచుకోను.

పుల్ల : మావాళ్లు నలుగురూ కలిసొస్తే అదెంతపని బాబూ, నాలుగు రోజుల్లో తవ్వేయ్యం.

రామ : కలిసి రాకేంజేస్తాంరా. చంద్రయ్యగారికి సాయం చేద్దామంటే, కాదనేవాడుండాడా మన పల్లెలో. ఇదిగో మోహన్ బాబూ! నువ్వూ, సూరయ్యగారూ కలసి సాయంత్రం అట్టా రండి, మనాళ్లు నలుగుర్నీ పిలిచి మాట్టాడదాం.

మోహ : ఓ, తప్పకుండా.

(రామదాసు, పుల్లయ్య వెళుతూవుంటారు. వాళ్ల వెనక చంద్రయ్య కూడా బయలుదేరతాడు.)

సూర : నువ్వెక్కడికి అన్నయ్యా?

చంద్ర : ఇందాక గిత్తలు సరిగా నీళ్లు తాగలేదురా. (వెళతాడు)

సూర : తనకి ఉండనీ వుండకపోనీ, ఆ గిత్తలకి కడుపునిండా వుంటే చాలు, లేకపోతే ఆయనకి నిదరపట్టదు.

మోహ : అంత ప్రేమగా పెంచాడుగనుకనే వాటి కంత విశ్వాసం.

సూర : విశ్వాసం ఏంటిరా! ఆయన ఒక్కపూట కనబడకపోతేసరి, నీళ్లూ, మేతా మానేస్తయ్. అవి చూస్తా వుండగా ఆయనమీద ఎవడైనా చెయ్యేశాడో చచ్చాడన్నమాటే!

మోహ : గోపాలరావుగారి దొడ్లోనుంచి ఆ చిన్న గిత్తను తీసుకొచ్చినప్పుడు, నిజంగా నేనది బతుకుతుందనుకోలా!

సూర : బతుకుతుందనుకుంటే అసలు ఆయనిచ్చేవాడా! పురుగులు దీసి, పుళ్ళు కడిగి, దాన్ని బతికించటానికి నానా చెరలు వడ్డాడు. ఇప్పుడు దాన్ని కొట్టేది యీ చుట్టుపక్కల లేదనుకో.

మోహ : మీా ఇంటిగిత్తమాత్రం !

సూర : దానిసంగతి సరేసరి !

మోహ : దానికేంగాని, ముందు ఆ నుయ్యిపని గట్టిగా చూడాలి. సాయంత్రం వెళదాం.

సూర : సరే. (మోహన్ వెళ్ళిపోతాడు. చంద్రయ్య వచ్చి మంచంమీాద నడుంవాల్చి ఒళ్ళు విరుచుకుంటూ, ఆవులిస్తాడు. అప్పుడే వచ్చిన కనకమ్మ ఈ దృశ్యాన్ని చూచి కొంతతడవు ఆలోచించి, ఏదో స్ఫురణకు రాగా తల పంకిస్తూ, లోనికి వెళుతుంది. సూరయ్య స్టూలుమీాద కూర్చుని చుట్ట చుట్టుకుంటూవుంటాడు.)

చంద్ర : మనవాళ్లు నుయ్యి తవ్వటం ఖాయమే ననుకో. తరవాత దాన్ని కట్టించటం ఎట్టాగా అని !

సూర : అదృష్టం బాగుండి ఆ పొలాన నీళ్లుబడాలిగాని, డబ్బు చూడకలేకపోతాం !

నిర్మ : (ఒక తవ్వాపట్టుకొని తండ్రివద్దకు వచ్చి) కాస్త కూర్చో నాన్నా. (చంద్రయ్య లేస్తూవుంటాడు.)

సూర : ఎందుకమ్మా !

నిర్మ : నాన్నకు దిష్టి తియ్యాలి.

చంద్ర : (లేచి) దిష్టి ! నాకేం దిష్టి !

నిర్మ : అదంతా నాకు తెలియదు. పిన్ని చెప్పింది !

సూర : (నవ్వుతాడు)

చంద్ర : (నవ్వి) నాకు కాదుగాని, మన గిత్తలకు తీసిరా అమ్మా. (నిర్మల కనక్క తిరుగుతుంది.)

కనక : ఎవరి కన్నెట్లాటిదో ఎవరుచూశారూ ! తియ్యమ్మా తియ్యి. లేకపోతే ఎందుకొస్తయ్, ఆవులింతలూ !

సూర : ఇదిగో అన్నయ్యా ! తప్పదు లే కానియ్.

నిర్మ : తూ్ప. తూ్ప. (అంటూ తండ్రికి దిష్టితీస్తుంది. తర్వాత రెండడుగులు వేసి) మరి బాబాయికో ?

కనక : బాబాయికంట బాబాయికి, బాబాయి కేంతీపరం (అంటూ నిర్మల చేతిలోని తవ్వ తీసుకొని దడదడ లోనికి వెళుతుంది. సూరయ్య, నిర్మల నవ్వుతూంటారు. రంగయ్యవచ్చి నిర్మలవంక చూస్తూంటాడు. నిర్మల సిగ్గుపడి లోనికి వెళుతుంది.)

సూర : (వెనుకకు తిరిగి చూచి) బావగారా ! దయచేయండి, ఏదో పనిమీద వచ్చారు ?

రంగ : పని ఉంటేనే రావాల్నా, కొత్తకొత్తగా మాట్లాడుతున్నావ్.

సూర : ఈమధ్య మాయింటికి రావటం మానుకున్నారుగా.

రంగ : అవుసరమైన పనిఉండి నాలుగురోజులు రాలేదు. ఇక అంతేనా ఏంవిటి ?

చంద్ర : అట్టా ఎందుకవుతుంది లెండి.

రంగ : చంద్రయ్యగారూ, చేను బాగుచేత ప్రారంభించారటగా?

చంద్ర : ఏంజేస్తే ఏమవుతుంది.

రంగ : ఏం !

చంద్ర : ఏదిచెయ్యాలన్నా నీరుకావాలి.

రంగ : బావి తవ్విస్తేసరి.

సూర : అద్దద్దాఅంటే అంతవరకు తలాఒక చెయ్యావేస్తారు. తరవాత దాన్ని కట్టించే దెట్టాగో తోచటంల్లా.

రంగ : ఆగుతుందీ ? అప్పోసప్పో తెచ్చి కట్టించేది.

సూర : రైటే, ఆ యిచ్చేదాత ఏడీ ?

రంగ : ఎప్పుడూ పదిమందిని చేతులో వుంచుకుంటావు. నీవు తల్చుకుంటే ఆగుతుందా?

చంద్ర : ఎందుకు చెపుతారు రంగయ్యగారూ, డబ్బుతో పని, ఎవ్వరూ ఇయ్యరు.

సూర : అందాకా యెందుకు? ఇ పు డు ని న్ని య్య మ ం టే యిస్తావ్?

రంగ : ఏమాత్రంకావాలి?

చంద్ర : కావాలిమరి ఒక వెయ్యి!

రంగ : నా దగ్గర వున్నదికూడా అంతే... స రే, తీసుకోండి.

సూర : (నవ్వుతూ) ఇంకా రెండువేలు వుండయ్యంటే మేమేమీ కన్నం వెయ్యంలే.

రంగ : నేను అబద్ధమాడుతున్నా నంటావా?

సూర : లేకపోతే కొడుకు పెళ్లికని పోగుచేసిన డబ్బంతా యేం జేశావు బావా?

చంద్ర : ఇంతకీ యెక్కడన్నా సంబంధం కుదిరిందా?

రంగ : ఆఁ, దూరపుకొండలు నునుపు. తిరగడమేగాని లాభం లేదు.

సూర : తిరిగితే లాభంలేదు. మాబోటివాళ్ళ పిల్లలు పనికిరారు. ఏం జేస్తావు కొడుకుని?

రంగ : అదుగో, ఆమాటే బాగుండదు. ఎందుకు అనవసరంగా నామీద నిందవేస్తావ్.

చంద్ర : ఇందులో నిందేముంది లెండి.

రంగ : నిందగాక ! మీ యిద్దరిలో ఎవరైనా, ఎప్పుడైనా యీ విషయం నన్నడిగారా ? అడిగితే నేను కాదన్నానా ?

సూర : ఎప్పటిమాటో ఎందుకు ? ఇప్పుడడుగుతున్నాం ఏమంటావ్ ?

రంగ : నీవు అడగడం, నేను కాదనడమూనా ? ఎప్పుడన్నావుందా ?

సూర : అయితే ఆలస్యం ఎందుకు ? ఈ నెలలో మంచి లగ్గాలుండయ్యంట.

( సరోజవచ్చి వారి సంభాషణ వింటూవుంటుంది. )

రంగ : నిదానించు ! పెళ్ళంటే మాటలా ! ఎన్ని సర్దుకోవాలి. మీరు బావి పనిపెట్టుకున్నారా ? ఇవతల నేనూ పిల్లకు రెండు నగలు చేయించుకోవాలా ? ఇంకా డబ్బూ అదీ చూచుకోవాలా ? ముందు భూమి రిజిష్టరు కావాలా ?

సూర : సరే !

రంగ : సరే, అవన్నీ కానివ్వండి. తొందరపడితే ఎట్లా.

( రంగయ్య నవ్వుతూ వెళ్తాడు. సరోజ లోనికి పరుగెత్తుతుంది.)

సూర : (తల పంకించి ) తస్సాదియ్యా !

చంద్ర: ఇదేంటిరా సూరయ్యా, మన అమ్మాయిని చేసుకుంటానని కొడుకూ, వద్దని ఈయనా రోజూ తగాదాపడేవాడు. అదంతా ఏమయిందిరా ?

సూర : దాని కదే. ఇదివరకు మన సంబంధాని కిష్టపడంది అమ్మాయి మంచిదికాదని కాదు, డబ్బు లేదని.

చంద్ర : అప్పుడు లేనిడబ్బు యిపుడెక్కడనుంచి వచ్చింది ?

సూర : ఏం, రెండువేలు జేసే గిత్తలు తయారయిన్నై. రెండెక రాలు భూమి సంపాదించావు. బావి తవ్వించి అందులో బంగారం పండించడానికి నువ్వుండావు. ఇంకేం గావాలి !

చంద్ర : అంతే నంటావా !

సూర : అంత గాక.

చంద్ర : ఏదన్నా గాని, వాళ్ళిద్దరి పెండ్లికి వొప్పుకున్నాడు, అదే పదివేలు.

సూర : సరేగాని అన్నయ్యా, ఇందాక రామదాసు, పుల్లయ్య రమ్మన్నారుగా.

చంద్ర : అవునురా, పోదాం, పద. (ఇద్దరూ బైటికి వెళ్తారు. సరోజ నిర్మలను చేయిపట్టి లాగుకొనివచ్చి గంతులువేస్తూ పాటందుకుంటుంది. నిర్మలకూడా పాడుతుంది. )

పాట

రావె తుమ్మెదా రా రావె తుమ్మెదా
కిలకిలా నవ్వు ఈ లే గులాబీ పువ్వు
ఘుమఘుమా పరిమళ మెగజిమ్ముచున్నది ||రావె||
గలగలా పారేటి సెలయేటి పాట విని
తలపునకు రా, నీవు పులకరించెను మేను ||రావె||
తలిరు జొంపములోన నిలచి నీరాకకై
కలవరించే గులాబి కన్నెకోరిక తీర ||రావె||

(పాట పూర్తి అవుతుంది. సరోజ వెళ్ళి నిర్మలను కౌగలించుకుంటుంది. నిర్మల సరోజతల నిమురుతూవుంటుంది.)

[ తెర ]

# భూమి కోసం

## ఐదో రంగం

రంగయ్య యిల్లు

[గోడలకు జాతీయ నాయకుల ఫొటోలు, వాటి మధ్య లక్ష్మీదేవి ఫొటో తగిలించి వుంటాయి. డ్రాయరు, రెండు కుర్చీలు, ఒక రాక్. డ్రాయరుమీద రెండు పుస్తకాలు. మోహనరావు కుర్చీలో కూర్చుని పాట ప్రారంభిస్తాడు. అతని చేతిలో పాటలపుస్తకం వుంటుంది. సరోజ అన్న చేతిలోని పుస్తకంలో చూస్తూ, ఆలకిస్తూ మధ్య మధ్య పాట అందుకుంటూ వుంటుంది.]

(తెర లేస్తుంది)

పాట

మోహ: పదవోయి తెలుగువాడ
సమయమురా కదలుమురా
ఇదె సమయమురా – మొనగాడ ||పద||

తెలుగు తోటలో తీయని ఫలములు
తినమరిగిన లంబోదరులు
అధికార వ్యామోహపీడితులు
అరుగో స్వార్థులు, ప్రముఖులు, పెద్దలు ||పద||

అందమైన ఈ తెలుగుతోట
కధినాధుడ వీవేరా

క్రూరమృగాలను, విషకీటకముల
కూల్చి వాటికను బాగుసేయర ॥పద॥

(పాట పూర్తి అవుతుంది. మోహనరావు రాక్‌లోని పుస్తకం తీసుకుని బయటికి వెళుతూవుంటాడు.)

సరో : ఎక్కడికయ్యా! వెళ్లు. వెళ్లి వదినకు పాఠం చెప్పు. పాపం యెదురుచూస్తూవుంటుంది. (మోహనరావు ముక్తసరిగా చెల్లెలి చెంప మీద కొడతాడు.) ఏంటయ్యా? మీరెప్పుడూ ఎప్పుడూ కొడతారూ! అతడు నవ్వుతూ వెళ్లిపోతాడు. సరోజ కుర్చీలో కూర్చుని పాట చదువుకుంటూవుంటుంది.)

రంగ : (ప్రవేశించి) అన్నయ్యేడమ్మా?

సరో : ఇప్పుడే బయటికి వెళ్ళాడు. (లేచి లోనికి వెళుతూవుంటుంది)

రంగ : (కూర్చుంటూ) కాస్సేపు యింటిదగ్గరుంటే వాడికి చీమలూ, జెర్రులూ పాకుతాయి. (ప్రహ్లాదచరిత్ర తీసి చదువుతూవుంటాడు. సరోజ తండ్రి నొకసారి చూచి లోనికి వెళుతుంది. గోపాలరావు సకిలిస్తూ లోనికివస్తాడు.)

రంగ : తరతరలాడుతూ లేచి దయచేయండి, దయచేయండి. (పై పంచతో కుర్చీ దులుపుతాడు)

గోపా : (కూర్చుంటూ) ఏఁవిటి చదువుతున్నావ్ ?

రంగ : ఏదో కాలక్షేపం. ప్రహ్లాదచరిత్ర లెండి.

గోపా : ఏ ఘట్టంలో ప్రవేశించావ్ ?

రంగ : ప్రహ్లాదుడు తండ్రిమాటలను తిరస్కరించుట.

గోపా : అఁహాఁ! తగిన ఘట్టంలోనే వున్నావ్. ఆఁ... మొన్న నీకు చెప్పిన బేరంసంగతి ఏమైంది?

రంగ : ఏ బేరం? (తల పైకెత్తి ఆలోచిస్తాడు)

గోపా : ఆఁ, అదేనయ్యా............
రంగ : ఓహో ! వెంకయ్య భూమిసంగతా ! వాడితో మనకు బేరం కుదరదులెండి. ధర మన అంచనాకు మించివుంది.
గోపా : సరె, ఈయేడు కాకపోతే ముందుకి. ఎక్కడికిపోతాడు అమ్మక !
రంగ : అంతేలెండి.
గోపా : ఆఁ, ఈమధ్య చంద్ర య్యెక్కడా కనబడడంలేదే!
రంగ : ఇదివరకు వూళ్లో వుండేవాడు గనుక, తరచు కనబడుతూ వుండేవాడు. ఇప్పుడు మీరిచ్చిన చేలోనే కాపురమాయె. ఆయన కదే స్వర్గం !
గోపా : (తలపంకిస్తూ) ఉహూఁ.
రంగ : మొన్న ఏదో పనిమీద అటువెళ్లాను...
గోపా : ఊఁ.
రంగ : కనబడి తోటలోకి తీసుకెళ్లాడు.
గోపా : అట్లాగా, తోట బాగుందా ?
రంగ : రకరకాల కూరగాయలు ! బాగానే పండిస్తున్నాడు.
గోపా : అదంతా నీ చలవే.
రంగ : నా దే ముందండీ !
గోపా : బావికి పెట్టుబడి పెట్టింది నీవే గదయ్యా !
రంగ : నాకుతోడు పెట్టుబడా ! ఏదో మావాడిబాధ భరించలేక యిచ్చానుగాని, అసలు భూదానంచేసిన దాతలు మీరు !

(చంద్రయ్యను తీసుకొని రాముడు వస్తాడు.)

చంద్ర : (లోనికి వస్తూనే) ఏఁవిటి బాబూ ! పిలిపించారు ?
గోపా : ఆఁ, ఏమీలేదు, స్టాంపులు తెప్పించావా ?

చంద్ర : స్టాంపులా ! ఎందుకు ?
గోపా : రేపు బస్తీకి వెళుతున్నాను. పొలం రిజిస్టరు చేయించు కోవూ ?
చంద్ర : ఇదివరకు మీ రీ మాట చెప్పలేదే. కాగితాలు నే నే తెప్పించుకోవాలని.
గోపా : పోనీ, అదేదో నేను చూస్తానుగాని, గిత్తెలు బాగా వున్నయ్యా ?
చంద్ర : ఏదో మీ దయవల్ల అట్టట్టా వుండయిలెండి. దానా ! పాడా.
రాము : అదేంటి చంద్రయ్యగారూ ? గుర్రాలల్లే అయ్యాం టేనూ !
గోపా : నోరుముయ్ , వెధవ. చెత్తవాగుడూ నీవూనూ, పోరా.
రాము : చిత్తం. (వెళతాడు)
గోపా : (చంద్రయ్యతో) ఈ మధ్య మన గిత్తెల్ని ఎవరో రెండు వేలకు అడిగారటగా ?
చంద్ర : రెండువేలకుపై నే అడిగారు, అడగటానికి.
రంగ : (ఆశ్చర్యంగా) రెండువేలకుపై నా ! ఇచ్చేస్తే పోయేదిగా. బోలెడంత డబ్బు చేతిలో పడేది !
చంద్ర : ఇవ్వటమా, చాటుత్తు ధనం పోస్తేమాత్రం యిస్తానా !
రంగ : (గోపాలరావువైపు చూస్తూ) ఏంవిటి ఈయన కీ వెర్రి !
గోపా : వెర్రి గాదయ్యా ! దొడ్లో పశువును అమ్మటమంటే రైతుకు అంత బాధ.
రంగ : అయితే ఇక యేదొడ్లో పశువులు ఆదొడ్లో వుండిపోవల సిందే ?

గోపా : అదెట్లా ! పరిస్థితుల్నిబట్టి అమ్మడం, కొనడం ఎవరికీ తప్పదు! అంతేగా చంద్రయ్యగారూ ?

చంద్ర : అంతే ననుకోండి, కాని......

రంగ : కానీ లేదు. అర్థమూ లేదు.

గోపా : ఇదిగో ! చంద్రయ్యగారూ, మీ రేమీ అనుకోకుండా వుంటే నే నొకవిషయం చెప్తాను.

చంద్ర : దానికేం, చెప్పండి.

గోపా : కాలం చూస్తే తారుమారుగావుంది. మీ తాహతుకు రెండువేల రూపాయల కిమ్మతుచేసే కోడెల్ని మేపడం అంటే......

రంగ : ఎంత కష్టం ...

చంద్ర : గొడ్డునీ, బిడ్డనీ పోషించుకోటానికి కష్టంఏంటి లెండి.

గోపా : అదిగాదయ్యా, రోజులన్నీ మనవిగాదు. కర్మంజాలక వాటిల్లో ఒకదానికి యేకాలో నొచ్చిందనుకో అప్పు డెంత ప్రమాదం ?

రంగ : ప్రమాదమని నెమ్మదిగా అంటారేమిటి ? రెండువేల రూపాయలూ, ఆ యేట్లో పొయ్యడమే !

చంద్ర : మీ రేమైనా చెప్పండి. వాటిని అమ్మటమనేమాట నా చెవులతో వినగూడదు.

రంగ : ఇదిగో ! బావా !

చంద్ర : (విసుగ్గా) బావా లేదు, బంధుత్వం లేదు వుండవయ్యా. వాటిని నా బిడ్డతో సమానంగా పెంచుకున్నాను.

గోపా : ఆ బిడ్డనుమాత్రం ఒకయ్యచేతిలో పెట్టకుండా తప్పుతుందా ?

రంగ : ఊహుఁ, ఎల్లకాలం ఇంట్లో వుంచుకుంటాడు.

చంద్ర : ఒకయ్య చేతిలో పెట్టినా దానిదారి వేరు. బతికినంత కాలం తండ్రనీ, బిడ్డనీ, రావటం, పోవటం అన్నీ వుంటయ్.

గోపా : అందుకనే, వీటిని పరాయివాడి కెవ్వడికీఅమ్మమనడంలా! మన దొడ్లోనే వుంటాయి. మీకు బుద్ధిపుట్టినప్పుడు రానూ వచ్చు, కావాలంటే నాలుగురోజులు మీ ఇంటికి తోలుకు వెళ్ళనూవచ్చు.

రంగ : దీన్ని కింకా ఆలోచనేఁవిటి బావా ! ఇంతకంటే మంచి సలహా ఏముంటుంది?

గోపా : ఇదిగో, చంద్రయ్యగారూ ! మీ క్షేమం కోరేవాడిని గనుక నే నీ సలహా చెప్తున్నాను. మన చిన్నగిత్తల్ని అయిదువందలకు కొన్నాను. అవి మీ పనికి చాలు. రంగయ్య గారి అప్పుతీరగా మిగిలిన డబ్బుతో అమ్మాయి వివాహం కూడా చెయ్యండి, ఏ బెడదా వుండదు. కృష్ణా, రామా అంటూ హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు.

చంద్ర : గోపాలరావుగారూ ! ఎందుకడుగుతారు పదిసార్లు, సెలవు. (లేచి వెళుతూవుంటాడు.)

రంగ : మరీ అంత మూర్ఖత్వం పనికిరాదు. ఆయ నేమీ దానమివ్వమనడంలా. కోరిన డబ్బిస్తానంటున్నాడు.

చంద్ర : (విసుగ్గా) డబ్బు, డబ్బు, పోయేటప్పుడు కట్టుకు పోతాడు! కావాలంటే నా ప్రాణం యిస్తా. వాటిని మాత్రం యియ్యను. (వెళతాడు)

గోపా : (తలపంకించి) ఊఁ, సరె.

రంగ : ఇవ్వడట, యివ్వడు. మెడలమీంద యెక్కించుకుని వూరేగుతాడు.

గోపా : ఆయన ఏం వూరేగితే నీకెందుకు. ముందు నీసంగతి నీవాలోచించుకో.

రంగ : (భయపడుతూ) నే నేం చేశాను.

గోపా : అప్పుపెట్టావుగా, వెయ్యిరూపాయిలు.

రంగ : నా డబ్బెక్కడికిపోతుంది లెండి.

గోపా : రెండు సంవత్సరాలు పోషించి, ఏదో యింతభూమి యిచ్చి, బతుకుదెరువు చూపించినవాడికి నాకే పంగ నామాలు పెట్టిన పెద్దమనిషి, నీ అప్పు తీరుస్తాడూ ?

రంగ : ఇవ్వకపోతే వూరుకుంటానా ; గోల్లాడగొట్టి వసూలు చెయ్యనూ.

గోపా : ఆయనదగ్గరే ముందయ్యా వసూలు చెయ్యడానికి ?

రంగ : ఏం, భూమిఉంది, ఎన్నున్నె, నా డబ్బుగో తవ్వించిన బావి వుంది. ఎక్కడికి పోతాడు ?

గోపా : (నవ్వి) భూమి రిజిష్టరు చేయకుండానే ఆయనదయ్యిందీ ! ఇకపోతే చరాస్తి. దానిమీద వసూలు చెయ్యటం నీ వల్ల యేమవుతుందయ్యా !

రంగ : (విచారంగా) అయితే నా డబ్బెగ తేంగాను ?

గోపా : నన్నడుగుతావేం; కాబోయే వియ్యంకుడుకాబోలు ! వెళ్ళడుగు.

రంగ : నాకు వియ్యంకు డయ్యే యోగ్యతేవుంటే ఇట్లాయెందుకు చేస్తాడు. ఆ గిత్తల్ని మీకిచ్చి భూమి రిజష్టరుచేయించు కునేవాడు.

గోపా: అసలీ సంబంధం ఒప్పుకోవడంలో నీ వుద్దేశవేఁవిటి? ఘరానా కుటుంబమనా, యింతమాత్రంపిల్ల దొరకదనా, లేక, ఈపాటికట్నం ఇచ్చే వియ్యంకుడు దొరకడనా? పోయిన డబ్బు ఎట్లాగూ పోయింది. ఇప్పటికైనా మేలుకున్నావు, సంతోషం.

రంగ: మీరుండగా నాడబ్బెక్కడికి పోతుంది.

గోపా: ఏఁవిటి నీగొడవ! పిల్లతోపాటు ఆ డబ్బుకూడా నన్నే చూడమంటావా? మంచివాడివే!

రంగ: (ప్రాధేయపడుతూ) మీరు పూనుకోకపోతే నాడబ్బు నాకు రాదు.

గోపా: వెనకా ముందూ ఆలోచించకుండా, యిట్లాంటి తెలివి తక్కువ పనులు చేస్తావు. తీరా పీకమీదకొచ్చినప్పుడు నా నెత్తిమీద కూర్చుంటావు. సరే, ఆ నోటిట్లా తగలెయ్.

రంగ: చిత్తం, చిత్తం. (డ్రాయరు సొరుగులోనుంచి నోటుతీసి గోపాలరావు కిస్తాడు)

గోపా: (నోటు తీసుకుని) నీ క్షేమంకోరి ఈ వ్యవహారం నా మీదకు తీసుకున్నాను. కొంపతీసి మధ్యలో వాళ్ళతో షరీకు కావుగదా?

రంగ: నేనా! వాళ్ళతోనా! ఈ జన్మలో జరుగదు. నోటు మీ చేతిలో పెట్టాను. దాన్ని యేంచేసినా మీరు చెయ్యాలిసిందే.

గోపా: అదికాదు రంగయ్యా! నీకొడుకా మాటవిన్నారకం కాదు.

రంగ: కాక వాడు చేసేదేఁవిటిలెండి.

గోపా : నా కెందుకు చెప్తావు ! తనంత కొడుకైన తరువాత వాడిమాట కాదనడం అంత సులభంకాదు.

రంగ : ఆ సందేహం మీా కెందుకు. ఆ నోటిలాయివ్వండి. ఇప్పుడే మీా పేర ఆర్డరువేస్తాను.

గోపా : సరే, నీ ఇష్టం. (నోటు యిస్తాడు. రంగయ్య నోటు వెనుక వైపున రాస్తూవుంటాడు) ఇదిగో రంగయ్యా ! ఎందుకైనా మంచిది, మూాడుమాాసాల వెనక తేదీ వెయ్.

రంగ ! చిత్తం. (నోటు ఆర్డరువేయడం పూర్తిచేసి, గోపాలరావు కిస్తాడు)

గోపా : (నోటందుకుని మడిచి జేబులో పెట్టుకుంటూా) ఇతరుల కుటుంబ వ్యవహారాల్లో జోక్యం అంత మంచిదిగాదు. అయినా ప్రాణస్నేహితుడవుకనుక చెప్తున్నాను. మోాహనరావు ప్రవర్తన యేమీా బాగుండలేదు. తా చెడ్డకోతి వనమెల్ల చెరిచిందని, ఊరునుకూాడా పాడుచేస్తున్నాడు. వాడిని యేదోవిధంగా అదుపులోపెట్టాలి. లేకపోతే నీ పరువుప్రతిష్ఠ లకుకూాడ భంగం.

రంగ : అందుకే తమతో మనవిచేశాను. వాడి కేదో వుద్యోగం చూపి అవతలకు పంపితే యేబాధా వుండదు.

గోపా : (ఆలోచించి) గవర్నమెంటు వుద్యోగం కావాలంటే కొంతకాలం పడుతుంది. ప్రస్తుతం మన ఫాక్టరీలో ప్రవేశ పెడదాం.

రంగ : అదైనా మంచిదే, తిని తిరగకుండా. ఏదో వొకపనిలో వుంటే వాడేబాగుపడతాడు.

గోపా : (గడియారం చూచుకొని) టైం అయింది. ( బయలుదేరతాడు. రంగయ్యకూడా లేస్తాడు.)

గోపా : ( వింగువరకు వెళ్ళి ) ఇదిగో రంగయ్యా!

రంగ : అయ్యా !

గోపా : ఈ విషయం మోహనరావుకు తెలియకుండా వుంచడం...

రంగ : ఆ మాత్రం తెలియదంటారా !

గోపా : (నవ్వి) సరే వుండు. (వెళతాడు)

(రంగయ్య తిరిగివచ్చి లెక్కలు చూచుకుంటూ వుంటాడు.)

సరో : (వచ్చి) ఎందుకు నాన్నా గోపాలరావుగారు మనింటికి వచ్చారు.

రంగ : (విన్నదేమోనన్న అనుమానంతో కుమార్తె వైపు చూచి) నాతో మాట్లాడ్డానికి వచ్చారు. నువ్వినలా?

సరో : వినలేదు నాన్నా, చదువుకుంటున్నాను.

రంగ : అవేవో వ్యవహారవిషయాల్లే, నీ కెందుకు నీవు పోయి చదువుకో. (సరోజ వెళుతుంది. మోహనరావు వచ్చి చేతిలో పుస్తకం రాక్‌లో పెడుతూవుంటాడు.)

రంగ :. ఎక్కడికి కెళ్ళావురా ?

మోహ : కొద్దిగా మహాయదుపనివుండి వెళ్ళాను.

రంగ : ఏ పోరంబోక కొలవడానికి ?

మోహ : కాదు, సుబ్బయ్యబాబాయిగారి పొలం.

రంగ : ఎవరిదైతేమాత్రం ఇంత పొద్దెక్కేదాకానా ?

మోహ : మరొకసా రెందుకని పని పూర్తిచేసుకొచ్చాను.

రంగ : పోయి తిండి తిను, చేసుకొచ్చావ్ ఘనకార్యం.

(మోహనరావు లోనికి వెళుతూవుంటాడు.)

రంగ : అరే, అబ్బాయ్! (మోహనరావు ఆగుతాడు) బట్టలు ఇస్త్రీకి వేశావు కాబోలు వొచ్చాయా ?

మోహ : ఆఁ, ఎందుకు ?

రంగ : రేపు ప్రయాణ ముంది. గోపాలరావుగారు వారి మిల్లులో నీకు వుద్యోగం యిచ్చారు.

మోహ : గోపాలరావుగారా ! ఉద్యోగమా !

రంగ : వారే స్వయంగా మన యింటికివచ్చి, యీ విషయం చెప్పి వెళ్ళార్రా.

మోహ : ఊఁ, బలే ప్లాను !

రంగ : ఇందులో ప్లానేఁవిటిరా ? ప్లాను.

మోహ : ఫ్యాక్టరీలో పనివాళ్ళని సగానికి తగ్గించాడు. తాను స్వయంగా వచ్చి నాకు వుద్యోగం యిచ్చాడూ !

రంగ : అవునోయ్ ! మన కుటుంబంమీద ఆయనకున్న అభిమానం అట్లాంటిది.

మోహ : ఇన్నాళ్ళనుంచి యేమైందో, ఈ అభిమానం ! నాకు తెలుసు నాన్నా ఈ నాటకమంతా. ఏదోవిధంగా నన్నీ వూరినుంచి వెళ్ళగొట్టడం ఆయనకు అవుసరం. అందుకని యీ వుచ్చుపన్నాడు.

రంగ : అవన్నీ నీకెందుకోయ్. ఇంతకూ యిప్పు డేమంటావ్ ?

మోహ : నేనా వుద్యోగం చెయ్యదల్చుకోలా.

రంగ : చెయ్యక గుడ్డి గుఱ్ఱాలపళ్ళు తోముతావా ?

మోహ : ఇంతకంటె అదేనయం. వూళ్లోవాళ్ళంతా వుద్యోగాలు జేసే బ్రతుకుతున్నారా ?

రంగ : వాళ్ళ కేం, శుభ్రంగా వ్యవసాయం చేసుకుంటున్నారు.

మోహ : నేనూ అదే చేస్తాను.

రంగ : ఏమిటి! ఇన్నాళ్ళు చదివించిం దిందు కేనా.

మోహ : ఏం, చదువుకున్నవాళ్ళు వ్యవసాయంచేయకూడదా! పోనీ మీ కది ఇష్టంలేకపోతే పదిమంది పిల్లలకు చదువు చెప్తాను.

రంగ : ఈ తలతిక్కవ్యవహారాలు నాదగ్గర సాగవు. ఏమోలే అని వూరుకుంటూంటే నీ యిష్టం వచ్చినట్లు సంచరిస్తున్నావ్. ఈ రోజు మొదలుకొని ఆ చంద్రయ్యగడప తొక్కావంటె మర్యాద దక్కదు.

మోహ : ఏం, ఆయన గడపతొక్కడాని కిష్టంలేని పెద్ద మనుషులు, ఆయన కూతుర్ని మీ కొడుక్కి చేసుకోవడానికి యెందు కంగీకరించారు?

రంగ : అది నా యిష్టం.

మోహ : మీ యిష్టా యిష్టాలమీద ఆధారపడి వుండడానికి ఇదేం పశువులబేరం గాదు.

రంగ : నామాట కాదని ఆ నీచుడి కూతుర్ని...

మోహ : ఆయనగాదు నీచుడు. ఏ నీచానికి పాల్పడ్డా మీరూ, మీ గోపాలరావూను.

రంగ : (బిగ్గరగా) మోహన్ ! ......

మోహ : (ఆవేశంగా) చంద్రయ్యగారు తన గిత్తల్ని అమ్మడాని కిష్టపడడని మీకు తెలియకపోయినా, మీ గోపాలరావుకు స్పష్టంగా తెలుసు. ఏదో ఒకవిధంగా ఆయనతో పేచీ పెట్టుకుని భూమి రిజిష్టరు చెయ్యకుండా ఎగకొట్టడాని

కీ ఎత్తులన్నీ. గోపాలరావు ఆయన్ని సర్వనాశనం చెయ్యాలని కుట్రలు పన్నుతున్నాడు. అందుకు మీరు తోడ్పడుతున్నారు.

రంగ: (కోపంగా) నోరుముయ్! ... (సరోజ వింగులో నిలబడి తండ్రివైపు, అన్నవైపు భయంతో చూస్తూవుంటుంది.)

మోహ: ఇవ్వాళ చంద్రయ్యగారి నెత్తిన పెట్టబోయే చెయ్యి రేపు గోపాలరావు మీ నెత్తిన బెట్టినప్పుడుగాని మీ కర్థం కాదు. ఇట్లా నిలువుదోపిడి చేసేవాళ్ళను ప్రజ లెంతోకాలం సహించరు. ఆరోజు దగ్గరలోనేవుంది.

రంగ: (మండిపడుతూ) ఈ పిచ్చి పిచ్చి వాగుడు కట్టిపెట్టి నోరు మూసుకుని చెప్పినట్లు పడివుండు. లేదా, నా యింట్లో ఒక్క-క్షణం వుండడానికి వీల్లేదు.

మోహ: మీ రుండమన్నా వుండను. మీరు నామీద ప్రయోగించదలచిన ఆయుధాలన్నిటిలో యిదొక్క-టే మిగిలివుంది. ఇప్పు డదికూడా ప్రయోగించారు. మీ యింటికి కొక నమస్కా-రం. మీకూ నమస్కా-రం. (గబగబ వెళుతూంటాడు. సరోజ 'అన్నయ్యా' అంటూ పరుగుపరుగున వచ్చి, మోహనరావును కౌగలించుకుని యేడుస్తుంది.)

మోహ: (చెల్లెలి తల నిమురుతూ) ఏడవకమ్మా, ఏడవకు.

రంగ: (వచ్చి సరోజను లోనికి లాక్కు-పోతూ) రా, ఇవతలకు. వాడు నీకు అన్నాగాదు, నాకు కొడుకూ గాదు.

(సరోజ అన్నయ్యా! అన్నయ్యా! అంటూ తండ్రి చేతుల్లో గిలగిల కొట్టుకుంటూ వుంటుంది. మోహనరావు బాధపడుతూ వెళ్లిపోతాడు.)

( తెర )



# భూ మి కో స ం

## ఆరో రంగం

తోట, చంద్రయ్య యిల్లు.

( సూరయ్య, మోహనరావు వస్తారు. )

సూర : తొందరపడి నిన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టాడేగాని తరవాత మతి, మతిలో లేనట్టుంది రంగైబావకి.

**మోహ :** (పచారుచేస్తూ) ఊం.

సూర : ఎందుకోగాని గోపాలరావు యింటచుట్టూ కాలుగాలిన పిల్లికిమల్లె తిరుగుతున్నాడు.

**మోహ :** ఆ తిరగటానికి కొత్తయేంవిటిగాని, అనవసరంగా నిన్ను తిడుతున్నాడట మాంవాం.

సూర : తనకు తెలియకుండా నీకూ, నిర్మలకు పెళ్ళిజేశాం గదూ, ఆ మంటమీద తిడుతున్నాడేమోలే, తిట్టుకోనియ్.

**మోహ :** అర్థంలేదు.

సూర : (లోనికి చూచి) నాన్నేడమ్మా ?

నిర్మ : (లోపలనుంచి) తోటలో గడ్డిగోస్తున్నాడు బాబాయ్.

సూర : ఇంత యెండలోనా ! ఏలాపాలా లేదూ. నేను పోయి సందెడు కోసుకొస్తానుండరా అబ్బాయ్. (వెళతాడు)

**మోహ :** (విచారంగా కూర్చుంటాడు. నిర్మలవచ్చి మోహన్‌కు దగ్గరగా నిలబడుతుంది. కాని అతడామెను చూడడు. శబ్దంచేస్తుంది. అతనికి వినిపించదు.)

నిర్మ : ఏంవిటి మోహన్ ! అట్లా వున్నావ్ ?
మోహ : (తెప్పరిల్లి) ఏమీ లేదు.
నిర్మ : సరోజ జ్ఞాపకంవచ్చిందా ?
మోహ : ఎంతబాధ పడుతూవుందో !
నిర్మ : మీ నాన్నగారు కోపంలో యేదోఅన్నారుగాని తర వాత కుమిలిపోతూనే వుంటారు.
మోహ : అందుకని ఏం చెయ్యమంటావ్ ?
నిర్మ : ఇప్పుడు యింటికెళితే ఆయనగా రేమీ అనరను కుంటాను.
మోహ : అనటం, అనకపోవటం అది వేరే సంగతి. అందు వల్ల మా యిద్దరికీ సుఖం లేదు నిర్మలా !

( రామదాసు వస్తాడు. )

నిర్మ : రా! తాతా !
మోహ : పుల్లయ్య యేడీ? రాలేదేం తాతా?
రామ : ఏమో బాబూ ! నా కంటే ముందే బయలుదేరాడు మరి.
చంద్ర : (ప్రవేశించుతూ) ఎంతసేపయ్యింది రామదాసూ వచ్చి ?
రామ : ఇప్పుడే బాబూ.
నిర్మ : పద నాన్నా.
రామ : ఇంకా భోజనం కాలేదా ఏంటి ?
చంద్ర : లేదు రామదాసూ. (చంద్రయ్య లోనికి వెళతాడు. ఆయన వెనుక నిర్మలకూడ వెళుతుంది.)
రామ : గిత్తలకి మూడువేలైనాపెట్టేవాడేనంట గోపాలరావు గారు.

మోహా : ఎవరన్నారు ?

రామ : మీా నాయన. మొన్న పందాల్లో మొదటి బహుమానం కొట్టుకొచ్చినయ్ గదూ. అప్పటినుంచి పడింది గోపాలరావుగారికి ఆటిమీాద కన్ను. లేకపోతే ఆయనేంటి, మూాడువేలుపెట్టి గిత్తల్ని కొనటమేంటి.

నిర్మ : (ప్రవేశించి) మమ్మల్ని వుద్ధరించాలని.

మోహా : అవును, పంచాయతీబోర్డు నుద్ధరించాడు, స్టోర్సు నుద్ధరించాడు, చివరికి దేవాలయాన్నికూడా వుద్ధరించాడు. ఆయన ఉద్ధరించని దెవర్ని !

చంద్ర : (లోపలినుంచి) అమ్మా !

నిర్మ : వస్తున్నా నాన్నా (లోనికి వెళుతుంది.)

రామ : సరేగాని, యీగిత్తల్ని ఆయన యెందుకు అడిగినట్టూ?

మోహా : ఇవ్వని గిత్తల్నడిగి యీాయనతో పేచీపెట్టుకోడానికి.

రామ : పెట్టుకుని యేం జేస్తా డీయన్ని ?

మోహా : ఏంజేస్తాడు. తోటలోనుంచి బయటికి గెంటుతాడు.

(ముందు నిర్మల, వెనుక చెయ్యి తుడుచుకుంటూ చంద్రయ్యా వస్తారు.)

నిర్మ : గెంటటమే ! గెంటితే వూరుకుంటామా ?

మోహా : ఏం జేస్తావ్ ? నీ కేం ఆధారముంది ? ఎగ్రిమెంటూ; రిజిష్టరా !

రామ : నిజమే. (చంద్రయ్యతో) ఇన్నా ళ్ళెందుకూరుకున్నావు బాబూ ! ఆయనగుణం తెలిసుండికూడా.

చంద్ర : ఏం జేస్తాం రామదాసూ. ఆయనచుట్టూ తిరిగి తిరిగి కాళ్ళు బలపాలు కట్టినై నాకూ, మా సూరయ్యకి. చివరికి జానయ్యగారిచేతకూడ అడిగించాం.

రామ : అడిగించితే యేఁవంటాడు ?

నిర్మ : ఏఁవంటాడు ! ఇదుగో రేపు, అదుగో రేపు. గట్టిగా అడిగితే యేమంటాడో అదొ౯క భయం.

( కనకమ్మ ప్రవేశం )

కనక : (వస్తూనే) నేను ముందే చెప్పలా ? ఈ తోటలో ఒక్క దానివే వుండలేవని ? అంత బయంగావుంటే వెళ్దాం పద, మనిల్లు మనకే ఉంది.

( అంతా నవ్వుతారు )

మోహ : అదికాదత్తయ్యా ! గోపాలరావును భూమి రిజిష్టరు చెయ్యమని అడగటం భయంగా వుందట, మీ అమ్మాయికి.

కనక : ఎందుకు భయం ? అడిగితే తలగొట్టి మొలవేస్తాడా ?

సూర : (ప్రవేశించి) ఏడిశాడు! (మోహనరావుతో) కాని మనం ఒక కంట కనిపెట్టి వుండాలిరా అబ్బాయ్. ఇందాక నాకోసం కబురంపాడూ, ఎందుకోనని వెళ్లా.

మోహ : ఊఁ, ఊఁ.

సూర : నన్ను చూడగానే యెంతమర్యాద చేశాడని. కాఫీ గూడా తెప్పించాడు.

కనక : కాఫీ! ఏమనితాగా ఆ కొంపలో ?

సూర : ఆ డొకందు కిస్తే, నే నొకందుకు తాగాలేవే.

నిర్మ : ఇంతకూ, యేం జరిగింది ?

సూర : మోహనరావును మన యింటో వుండనియ్యటం తప్పంట. తండ్రికీ, కొడుక్కీ గాకుండా చేశామని లోకం యేదో అనుకుంటాందంట. ఈగోల వినలేక నా కోసం

కబురంపాడంట. ఏదో వాగాడు యిట్టాగే, నోటికొచ్చినట్టు.
నాకూ వళ్లు మండి నాలుగు జాడించి, యివతల కొచ్చా.

కనక : బలేపని చేశావు. (నిర్మలతో లోనికి వెళుతూ వుంటుంది.)

సూర : (మోహనరావును, నిర్మలను చూపుతూ) ఈళ్ళిద్దరికీ పెళ్ళి జేశామని, మనిద్దర్నీ జైలుకు పంపిస్తాడంటే రంగయ్యబావ!

కనక : ఏంటీ ? జైలుకు పంపుతాడూ ! పంపమను యీపాటి పంపుతాడో ! ఈయన పంపినోళ్ళే అక్కడపడి ఏడుస్తున్నారు. (నిర్మల, కనకమ్మ లోనికి వెళతారు.)

పుల్ల : (ప్రవేశించుతూ) కోట్లో గొడ్డుపడితే కనపట్టంల్లా మీూకు ?

చంద్ర : ఏంటి, గొడ్డా ! (గబగబ బయటికి వెళ్ళబోతాడు.)

పుల్ల : వెళ్ళక్కరలేదు లెండి. దాన్ని దూరంగా తగిలొచ్చాను.

చంద్ర : దారి తొక్కివుంటుంది. దాని కొక కంపమండ అడ్డం వేసొస్తా. (మూలనున్న రాగోల తీసుకొని, గబగబ బయటికి వెళతాడు.)

రామ : ఇప్పుడుదాకా ఎక్కడి కెళ్లావురా, పుల్లయ్యా ? నాకంటె ముందే బయలుదేరావుగో.

పుల్ల : గేదెని బందెలదొడ్లో పెట్టారు. దా న్నిడిపించుకొచ్చే టప్పటికి ఈయాలయ్యింది.

మోహా : ఎవరు పెట్టారు ?

పుల్ల : ఇంకెవరు ! ఆ పుణ్యాత్ముడు, గోపాలరావుగారు. బంజరులో తిరుగుతాందంట, దొడ్లో పెట్టించాడు ?

సూర : దొడ్లో పెట్టించాడా ? తల్లి సిగదరగ ! ఆడిందాట, పాడిందిపాటగా వుంది.

పుల్ల : బండరాము డొకడు జేరాడు, పెద్ద మగాడల్లె ఆయన వెనుక.

సూర : పట్టుకుని పక్కలిరగదన్నకపోయాన్ గాడిదకొడుకుని, తరవాత యేంవన్నా గాని.

పుల్ల : దొరకలా యదవ! ఇయ్యాల ఆడి సావో నా సావో తేల్చుకునేవాణ్ణి.

రామ : ఆణ్ణిగొట్టినా, ఆ బజార్లో కుక్కను గొట్టినా ఒకటే.

మోహ : అవును, తాతా! నీవు చెప్పింది అక్షరాల నిజం. వీడిదేముంది. ఇలాంటి గాంగును పోగుచేసి నాటకమాడించే సూత్రధారుడు వేరే వుంటే.

సూర : అందుకే కిలెరిగి వాతపెట్టమన్నారు.

పుల్ల : ఆ రా తెట్టాగూ తప్పనట్టే వుంది. బంజ రీయన తాత గాడి ముల్లెంట. దానిచుట్టూ రౌడీలను కాపలాపెట్టాడు, మన మెక్కడ దున్నుతామోనని.

సూర : మనాళ్ళు పదిమందీ కలిసిరావాలిగాని, ఆ రౌడీ లేం జేస్తారు, ఆయ నేం జేస్తాడు !

రామ : నిజమే మరి, అదే కనపట్టంల్లా.

మోహ : కనపడక పోవడం ఏంవిటి? ఈ సమస్యమీద పేద రైతులంతా మనల్ని బలపరుస్తున్నారు. ఇక కూలీల విషయం వేరే చెప్పాలా! ఆ భూమికోసం ప్రాణాలర్పించ డానికి సిద్ధంగా వున్నారు.

పుల్ల : మన చుట్టుపక్కల అన్ని వూళ్ళల్లోనూ బంజర్లు దున్నుకుంటున్నారు. మనమే సన్నాసులం.

రామ : మొన్న మా అల్లుడుగారి వూరెల్లాను. ఆళ్ళంతా కలసి కొద్దిగా బంజరుంటే దున్నుకున్నారు. మావాడూ

యిరవై సెంటు నాటేశాడు. పైరు నవనవలాడతాంది. ఎంత లేదన్నా నాలుగు మూండు బస్తాలకి చావుండదు.

పుల్ల : ఇంకేం, ఒకయ్యని దేవిరించకుండా కార్తీకమాసం వెళ్లి పోతుంది. మనంకూడా యియ్యాలో, రేపో దున్నాల్సిందే.

రామ : ఒకడికీ ఎద్దూ, మొద్దూ లేదు. ఏం దున్నుతాం ?

సూర : ఏం లేకపోతే, మనిషి కొంకపార తీసుకుంటే, రేపీపాటికి తిరగదీసి అక్కడ పెట్టం !

పుల్ల : అదొకలెక్కా ? ఇంటి కొంక ఆడుదొచ్చిందంటే పైరు కూడా వేస్తాం.

మోహ : (రామదాసుతో) ఏంవంటావు తాతా !

రామ : సరే, కానియ్యండి.

మోహ : అయితే నీవూ, పుల్లయ్యా పల్లెకు వెళ్ళి మనవాళ్ళను సిద్ధం చెయ్యండి. నేనూ, సూరయ్యమావాం రైతుల్ని కలుసుకొని మాట్లాడతాం.

(అంతా బయలుదేర్తారు. చంద్రయ్య వస్తాడు.)

రామ : (చంద్రయ్యతో) వెళతాం. బాబూ !

చంద్ర : ఉండండి, వస్తా (లోనికి వెళ్ళి ఒక బుట్టనిండా రాంములగపళ్లు తీసుకొని వస్తూ రామదాసుతో) ఏం లేదు, నాలుగు రాంములగ పళ్ళు. నువ్వూ, పుల్లయ్యా చెరిరొండూ తీసుకోండి.

రామ : ఎందుకులే బాబూ !

సూర : పరవాలేదు, తీసుకో రామదాసు దానిదేంటి !

చంద్ర : (నిర్మలతో) అమ్మా పిన్నినికూడా నాలుగుపళ్ళు పట్టు కెళ్ళమనకపోయా.

నిర్మ : నిన్నటివి అట్లాగే వున్నయ్యంట. అక్కర్లేదంది నాన్నా.

చంద్ర : సరె. (అందరూ బయలుదేరి వెళుతూవుంటారు.)

నిర్మ : ఇదిగో, పుల్లయ్యన్నా (అంతా వెనక్కి తిరుగుతారు) వదినకు పువ్వులంటే ఎంతో యిష్టం. ఇవిగో తీసుకెళ్లు (పువ్వు లిస్తుంది.)

పుల్ల : వచ్చేటప్పుడు అసలది చెప్పిందమ్మా. నేనే మరచి పోయాను.

(అంతా బయలుదేరుతారు. కనకమ్మకూడా వెళ్తూవుంటుంది.)

నిర్మ : (కనకమ్మతో) ఉండు పిన్నీ! (లోనికి వెళ్ళి పూలతో ప్రవేశించి) ఈ పువ్వులు సరోజకు అందించు. (ఇస్తుంది)

కనక : (తీసుకుంటూ) సరోజకు పువ్వులంటే ఎంతో పేణం.

(చంద్రయ్య, నిర్మలలు తప్ప, మిగతావారంతా వెళ్ళిపోతారు.)

చంద్ర : ఎందరొచ్చినా, సరోజ లేకపోతే సందడే లేదు.

నిర్మ : నిజమే. ప్రతి పనిలో "నేనూ" అంటూ తయారయ్యేది.

చంద్ర : ఈ రంగయ్య దేంప్రుటకో గాని, యిప్పు డుండమాట యింకాసేపటి కుండదు. ఎంతసేపూ డబ్బు, డబ్బు.

నిర్మ : ఆయన డబ్బు ఆయన కిచ్చివెయ్యడం మంచిది నాన్నా, ఏ గొడవా వుండదు.

చంద్ర : ఇస్తే బాగానే వుండును. ఎక్కడ తెద్దాం.

నిర్మ : ఈ యేడు మన తోటమీద కనీసం నాలుగైదు వంద లైనా వస్తయ్. ముందు అంతమట్టుకు యిచ్చేద్దాం.

చంద్ర : (కుమార్తె తల నిమురుతూ) కాదమ్మా! పుట్టిన బిడ్డవు పుట్టినట్టున్నావు. ఆ డబ్బుతో నీకొక నగ చేయించా లనుకున్నా.

నిర్మ : ఇప్పుడు నగలకేం తొందర్లే నాన్నా! ముందు మన కా అప్పు తీరితే...

(ఇంతలో కోర్టు అమీనా, గోపాలరావు, రాముడు, మరొక రౌడీ వస్తారు. తండ్రీ, కూతురు వారివైపు గుడుగా దిగా చూస్తారు.)

అమీనా : చంద్రయ్యగారంటే మీరేనా ?

(చంద్రయ్య నేనే అన్నట్లు తల వూపుతాడు.)

నిర్మ : అవును, ఎందుకు ?

అమీ : మీ చరాస్తిని గోపాలరావుగారు జప్తు చేయించారు.

చంద్ర : గోపాలరావుగారా ! ఆయనకు నేనేం బాకీలేనే !

అమీ : రంగయ్యగారు గోపాలరావుగారికి వెయ్యిరూపాయలు బాకీ. అది తీర్చలేక మీపేరు వీరికి అప్పగించారు వేశారు.

(చంద్రయ్య నివ్వెరపోతాడు.)

గోపా : (రౌడీలతో) ఊడదీయండిరా గిత్తల్ని.

చంద్ర : ఆఁ, గిత్తల్నా ! నా బొందిలో వూపిరుండగా నా గిత్తల్ని వూడదీయటమే ? ఎవడొస్తాడో రమ్మను. (గిత్తల దగ్గరకు పరుగెత్తుతాడు.)

గోపా : చూస్తారేరా, ముందు యీ కొంప పీకండి. (రౌడీలు ఇల్లు పీకుతూ వుంటారు.)

నిర్మ : ఎవళ్లురా మీరు. మీకు బుద్ధిలేదూ ? (అడ్డం వెళుతుంది)

రాము : హుఁ, ఏముందమ్మా మీ కిక్కడ, పొంత అవమానలు.

రెండవ రౌడీ : పోకపోతే, మెడబట్టి గెంటుతాం.

(రౌడీలు యింటిలో వస్తువులన్నీ చిందరవందర చేసి, కుండలు పగుల గొడుతూ, స్టేజిలోకి చెంబులూ, గ్లాసులు విసరివేస్తూ వుంటారు.)

నిర్మ : (వస్తువులు యేరుకుంటూ గోపాలరావుతో) ఈ భూమికోసం మా నాన్న రక్తమాంసాలు ధారపోసి నీకు తోట పెంచి

పెట్టాడు. ఇది ఆయన కష్టార్జితం. దీనిని నీవు హరించాలని వచ్చావు. ఇట్లా ఎందరి కొంప లాగుస్తావు.

గోపా : ఏయ్ ! జాగ్రత్తగా మాట్లాడు.

నిర్మ : ఏం, మాట్లాడితే? ఇంతకంటె ఏం చేస్తావ్, నీచుడ. ఎవరూ లేకుండా చూచి దొంగచాటుగా వచ్చావు. లేక పోతే నీ బ్రతుకు బయటపడేది. ఛీ, ప్రొద్దున్నే లేచి నీ ముఖం చూచినా పాపం. (గోపాలరావు రాముడికి సైగ చేస్తాడు.)

రాము : ఏంటమ్మా వూరుకుంటావుంటె తెగ వదరుతున్నావు.

(అంటూ నిర్మలను కర్రతో పడదోస్తాడు. ఆ విసురుకు నిర్మల నేలమీద పడుతూ "నాన్నా" అని అరుస్తుంది. నిర్మల కేక విని చంద్రయ్య "అమ్మా" అంటూ పరుగున వస్తాడు. కూతురు దుర్దశ చూచి యెదురుగా వున్న రౌడీ మీదకు "ఎవర్రా నువ్వు గాడిదకొడకా" అంటూ కర్ర యెత్తుతాడు. రాముడు వెనకవైపుగా చంద్రయ్య తలమీద కొడతాడు. మూల్గుతూ చంద్రయ్య కింద పడతాడు. కిందనున్న రాయి ఆయన ముఖానికి తగిలి రక్తం కారుతుంది గోపాలరావు "పదండిరా" అంటూ రౌడీలకు సైగచేస్తాడు. ఆ నలుగురూ గబగబా గిత్తలువున్న వైపుకు వెళతారు.

నిర్మల "నాన్నా, నాన్నా" అంటూ లేచి తండ్రివద్దకు వచ్చి ముఖం లోకి చూస్తుంది. ఆయన మాట్లాడడు. ఆమె లోనికి పరు గెత్తుతుంది.

బయట గోపాలరావూ, రౌడీలూ ఎడ్లను అదలించుతూ తోలుకు వెళుతున్న శబ్దం, గంటలమోత వినబడుతూవుంటుంది. నిర్మల గ్లాసుతో మంచినీళ్లు తెచ్చి తండ్రికి తాగించుతుంది. ఇంతలో రామదాసు పరుగెత్తు కుంటూ వస్తాడు. "ఓరి నీ పాపం పాడుగాను" అంటూ చంద్రయ్యను లేవదీసి కూర్చోబెడతాడు. నిర్మల మంచం తీసుకొస్తుంది. ఇద్దరూ కలసి చంద్రయ్యను మంచంమీద పడుకోబెడుతూ వుంటారు. "నా గిత్తలు, నా గిత్తలు" అంటూ చంద్రయ్య లేవబోతాడు. రామదాసు పట్టుకొని "వుండు బాబు, వుండు బాబు" అంటూవుంటాడు. ఇంతలో పుల్లయ్యా, సూరయ్యా, మోహన్ పరుగెత్తుకుని వస్తారు.)

నిర్మ : బాబాయ్!

సూర : భయం లేదులే, వుండమ్మా.

రామ : పుల్లయ్యా! కాస్తి తాటిపువ్వు పట్టుకురా. (పుల్లయ్య వెళతాడు.)

చంద్ర : (ఆయాసంగా) నా గిత్తలు.

సూర : నీ కెందుకు నీవు పడుకో అన్నయ్యా. నేనూ గిత్తల్ని తోలు కొచ్చేది. (చంద్రయ్యను పడుకోబెడతాడు.)

(ఇంతలో పుల్లయ్య తాటిపువ్వు తీసుకొని వస్తాడు. రామదాసు తాటిపువ్వు అందుకుని గాయానికి అద్దుతాడు. నిర్మల గుడ్డచీలిక అందిస్తుంది. రామదాసు కట్టు కడుతూవుంటాడు).

సూర : (అన్న రక్తంలో తడిసిన చేతులు చూచుకుని పండ్లు కొరుకుతూ) ఏరా పుల్లయ్యా!

పుల్ల : ఈ బతుకు బత్తికేకంటె చస్తేనయం. పదండి, పోదాం.

సూర : పద, చాకో బతుకో తేల్చుకుందాం.

మోహ : సూరయ్యమాంవా ఏంవి టీతొందర.

సూర : తొందరాలేదు, గిందరాలేదు. ఇక ఆగేది లేదు.

మోహ : ఆగక ఏం చేస్తావు ? వెళ్ళి వాడింటిమీద దొమ్మీ చేస్తావా ?

పుల్ల : ఏం చేస్తే, దొబ్బొచ్చిందా ?

మోహ : అవును. ఆపని ఎంత ప్రమాదమో మీరు ఆలోచించటం లేదు.

నిర్మ : ఇంటిమీదపడి హింసించేవారికి లేని ప్రమాదం మనకే వచ్చింది.

మోహ : ఆవేశంలోపడి మీా రెవ్వరూ నన్ను సరిగ్గా అర్థం చేసుకోవడంలేదు. ఇప్పు డతని యింటిమీాద కెళితే సాలి గూాడులో చిక్కిన యీాగల్లా అతను పన్నిన వుచ్చులో పడడమే జరుగుతుంది. తర్వాత విచారించి లాభంలేదు. అదీగాక, అతను తగినంత కట్టుదిట్టంగా వున్నాడు. పైన ప్రభుత్వ సహాయంకూాడా వుంది. మన కేముంది ?

పుల్ల : (కర్ర సలుపుతూ) మన కుండేది మనకీ వుంది.

మోహ : దాన్ని సమయం, సందర్భం లేకుండా వుపయో గించితే మనకే హాని.

రామ : ఇదిగో, సూరయ్యగారూ ! మోహన్‌బాబు యీాళ్లకి చిన్నాడైనా, యెవారానికి పెద్దాడు. ఎందుకు చెబు తున్నాడో కాస్త యినండి. తాడూ బొంగరం లేకుండా, పరుగెత్తుకెళ్లి ఏం జేస్తాం అక్కడ ?

సూర : (విసుగ్గా) ఛీ.

పుల్ల : ఎప్పుడూ యింతే, సమయానికి చేతులు విరగ్గొడతాడు. (కర్ర అక్కడ పారవేసి చతికిలబడతాడు.)

మోహ : ఇంతమాత్రానికే నిరుత్సాహపడితే ఎలా ? ప్రాణా లర్పించైనా సరే, యీా భూమిమీాద మనకున్న హక్కును కాపాడుకోవాలి. ఇంటింటికి తిరిగి యీా అన్యాయాన్ని చాటి చెబుదాం. గోపాలరావు బ్రతుకు బయటపెడదాం. ఈసారి గ్రామాన్నంతా యేకంజేసి తప్పకుండా దెబ్బకు దెబ్బ తీయగలం, పదండి వెళదాం. (వెళ్ళి పుల్లయ్యను లేవదీస్తాడు.)

నిర్మ : (పైటచెంగు నడుముకు చుట్టుకుంటూ) మోహన్! మీతోపాటు నేనూ వస్తాను.

సూర : సరే, పదండి. ముందు అన్నయ్యను యింటికి చేరుద్దాం.

(చంద్రయ్యమంచాన్ని నలుగురూ నాలుగువైపులాపట్టి లేపుతూవుంటారు. ఆయన "నా గిత్తలు, నా గిత్తలు" అంటూవుంటాడు.)

( తెర )



# భూమి కోసం

## ఏడో రంగం

[ రచ్చబండ. దానిమధ్య ఒక చెట్టు. దాని చుట్టూ సిమెంటుతో కట్టిన దిమ్మ. దిమ్మమీద శంకరయ్య రెడ్డిగం వేసుకొని కూర్చునివుంటాడు. తెర లేస్తుంది. గోపాలరావు వస్తాడు.]

శంక : ఓ! గోపాలరావా. రా, కూర్చో. (గోపాలరావు కూర్చుంటూవుంటాడు.) పొద్దున చంద్రయ్య కనబడ్డాడు.

గోపా : ఆఁ, ఏ మన్నాడు ?

శంక : ఏమంటాడూ, కళ్లూ, గిళ్లూ పీక్కుపోయినై. సగ మైపోయాడు, పాపం. పిచ్చిమాట నిజమే.

గోపా : దానికి మన మేం చేస్తాంలెండి. ఎవడి కర్మ వాడిది.

శంక : అదంతా యెవడు చూస్తాడు ! ఆ చంద్రయ్యను యీ స్థితికి తెచ్చింది నీవే నంటున్నారు.

గోపా : లోకులు, కాకులు ! ఏదో వాగుతూవుంటారు, తెలిసీ తెలియకుండా నోటికి వచ్చినట్లు.

శంక : అతనికి యేమిచ్చావో యిచ్చావు, రెండెకరాల పొలం. మళ్ళీ దాని జోలికెళ్ళకుండావుంటే బాగుండేదేమో !

గోపా : ఇచ్చినా, తినే యోగ్యత వుండొద్దూ. చంద్రయ్య మాట అట్లా వుంచండి. ఆయన కూతురుంది, నిర్మలట,

నిర్మల ! అది నన్ను కూసిన కూతలు యిన్నీ అన్నీ గావు. నేనుగనుక సరిపోయింది. మరొకళ్లైతే ........

శంక : పోయేకాలం ! (ఇంతలో రంగయ్య దగ్గుతూవస్తాడు) రావోయ్ రంగయ్యా ! ఏమిటయ్యా, అట్లా చిక్కిపోయావు ?

గోపా : ఈమధ్య కొడుకు యింట్లోనుంచి లేచిపోయాడుగదూ ! బెంగ పెట్టుకున్నాడేమో లెండి.

శంక : ఒక్కగా నొక్క కొడుకు. ఎంత జెప్పినా బెంగలేకుండా వుంటుందీ ?

రంగ : అదేమీ లేదు. కొద్దిగా జలుబు చేసింది.

గోపా : ఎన్ని జెప్పినా, నీవు తండ్రివి కాకపోతావా, వాడు కొడుకు కాకపోతాడా ! ఏదో ఆశ్రయించావని నేను నీకు సహాయం చేయడం, వాడేమో నన్ను వూరంతా ఎండ నెయ్యడం.

రంగ : ఏంవిటండీ గోపాలరావుగారు ! ఇల్లు వదలిపెట్టి వాడి దారిని వాడుపోయె. ఇంకా నే నేం చెయ్యను.

గోపా : చేయలేకపోవడ మేంవిటి ? నీ కొడుకు నామీద చేసే దుష్ప్రచారానికి కనీసం ఎదురు ప్రచారమైనా చెయ్యొచ్చుగా?

రంగ : ఏం చేస్తాను ! నోరు మెదిపితే జనమంతా నన్ను కాకని పొడిచినట్లు పొడుస్తున్నారు.

గోపా : చంద్రయ్యకూతురు– ఆం, ఆయన కూతురేంవిటి లే, నీ కోడలు– నడుంగట్టి వూరుమీదబడి తిరుగుతోంది. ఏగడపలో చూచినా ఆమెగా రేనట.

శంక : అప్పునప్పును. మా యింటికికూడా వచ్చింది.

గోపా : నిజంగా, ఈయన చేయదలచుకుంటే ఆ పిల్ల పాటి చేయ లేడూ!

రంగ : మీ రట్లా అంటే యేం చెప్పగలను.

గోపా : సర్లే, పద, వస్తాం శంకరయ్యగారూ. (అంటూ లేస్తాడు.)

శంక : ఎందాకా ?

గోపా : ఇవ్వాళ మన పంటకాలువకు అడ్డ వేయించుతున్నాను.

శంక : పంట కాలువకా !

గోపా : అవును, వస్తారా మీరుకూడా, వెళదాం.

శంక : (కంగారు పడుతూ) నేనా ! ఈ ఎండలో బ్రతకటానికేనా !

(గోపాలరావు, రంగయ్యా నవ్వుతూ వెళ్ళిపోతారు. శంకరయ్య లేచి చుట్టు చుట్టుకుంటూ పచారు చేస్తుంటాడు. మోహనరావు రామదాసు వస్తారు.)

రామ : దణ్ణాలండీ.

శంక : ఓ రామదాసా ! ఎక్కడి కిట్లా బయలు దేరారు.

రామ : తమ దర్శనానికే. ఇంటిదగ్గర కనుక్కుంటే భోజనం చేసి యిప్పుడే బయటికి వెళ్ళారన్నారు. ఇట్టా వచ్చాం.

శంక : అట్లాగా ! ఏమిటి పని ?

మోహ : గోపాలరావుగారి దౌర్జన్యాలు రోజురోజుకు మితిమీరి పోతున్నై, ఎంతకాలమని సహిస్తాం.

శంక : ఇప్పుడు గోపాలరావు యేం చేశాడు ?

రామ : ఇం కేం జెయ్యాలి శంకరయ్యగారూ ! చంద్రయ్యగారు యెంత మంచిమనిషో వూరందరికీ తెలుసు. కుదుఁ ఇస్తే పండగ అనుకొంటాడు.

మోహ : ఆ సంగతి శంకరయ్యగారికిమాత్రం తెలియదా తాతా. ఆ పుణ్యాత్ముడు అవసరమైనంతకాలం చంద్రయ్య గారిని ప్రుపయోగించుకున్నాడు. చివరకు ఆయన గొంతు కోశాడు. ఈ అన్యాయాన్ని యెదిరించడానికి వూరంతా సిద్ధంగావుంది.

శంక : ఉహుఁ, వుంటే ?

మోహ : ఆఁ, మరేం లేదు. పదిమందితోపాటు మీరుకూడా మాకు తోడ్పడాలని...

శంక : ఇదిగో, మోహనరావ్! ఇందులో నేనుమాత్రం తల దూర్చదలచుకోలేదు. కరవమంటే కప్పకు కోపం, విడవ మంటే పాముకు కోపం, ఎందుకొచ్చిన బెడద. (అంటూ వెళుతూవుంటాడు.)

రామ : బాబూ! కాస్త న్యాయం ఆలోచించండి. (సూరయ్య వస్తాడు)

శంక : న్యాయం! న్యాయం ఆలోచించడానికి నే నేం జడ్జీని కాదు. (వెళతాడు.)

మోహ : హుఁ, మీ న్యాయం యింత చక్కగా వుంది. ఇక...

రామ : కడుపునిండిన మారాజు. ఏది మాట్లాడినా చెల్లుతుంది.

సూర : ఏంటి చెల్లేది. గోడమీద పిల్లి వాటంగావుంది ఈయన యెవహారమంతా.

రామ : మొదట్నుంచీ అంతేలే.

మోహ : పుల్లయ్య యేడీ మావాఁ ?

సూర : ఇందాక జానయ్యగారు కూలికి రమ్మని పిలిచాడు. మనవాడు శాస్త్ర వెనకాముందూ ఆడాడు. ఏదో ఒక రూపాయిడబ్బులు వస్తే, దేనికైనా వస్తాయ్ వెళ్ళమన్నా.

మోహ : అలాగా, సరే, పదండి. జానయ్యగారినికలుసుకుందాం.

రామ : ఎందుకూ ? ఆయనతో యిదివరకే మాట్లాడేంగా.

మోహ : అయినా మరొకసారి కలుసుకోవడం మంచిది.

సూర : (వీంగులోకి చూచి) అడుగో, ఆయనే యిటు వస్తున్నాడు. (జానయ్య వస్తాడు)

మోహ : దయచేయండి జానయ్యగారు.

జాన : పాపం, ముసలాయన ఎట్లా వున్నాడు సూరయ్యా.

సూర : ఆయనకి పగలూ లేదు, రాత్రీ లేదు. ఎప్పుడూ నా ఎద్లూ, నా తోటా.

మోహ : ఇదివరకు ఆయన యెంత మితంగా మాట్లాడేవాడో, ఇప్పుడంత అమితంగా మాట్లాడుతున్నాడు.

రామ : మతి చెడిపోయి.

జాన : పాపం.

సూర : ఏదో ఒక విధంగా కోర్టులో డబ్బుకట్టి ఆ గిత్తల్ని ఇవతలకి తోలుకురావాలి. లేకపోతే ఆయన బతకడు.

మోహ : జానయ్యగారూ ! మీరీ విషయంలో సహాయం చెయ్యాలి.

జాన : ఊళ్ళో చందా వేయించారుగా, యెంతవరకు అయ్యిందది?

సూర : అడిగినవాడు లేదనకుండా కాగితంమీద గీత వేశాడు.

రామ : ఎంత రిచ్చినా నాలుగైదు వందలకి దాటదు.

మోహ : ఆ మిగతా పైకం మీరుచూడాలి జానయ్యగారూ, తప్పదు.

జాన : దాని దేవిఁటిగాని...

(పుల్లయ్యవచ్చి జానయ్యకు ఎదురుగా నిలబడతాడు.)

జాన : ఇదేమిటిరా అబ్బాయ్! యిట్లా వచ్చావ్, పొలం తడపకుండా.

పుల్ల : ఏంబెట్టి తడపను ?

జాన : ఏం కాలవ చచ్చిందా ?

పుల్ల : ఎగవన అడ్డేవేస్తే చావక ఏం చేస్తుంది ?

రామ : ఎగవనా !

జాన : ఎవ డా వేసింది ?

పుల్ల : (వ్యంగ్యంగా) మన గోపాలరావుగారు!

జాన : (ఆశ్చర్యంగా) గోపాలరావుగారా ! మొదటినుంచీ ఆ కాలవకింద దిగువసాగు. ఇప్పుడు ఎగువన అడ్డే వేయించాడూ!

సూర : ఏం, వేయించక . ఆయన క త్తి కెదురుందా ?

జాన : అదే తేల్చుకుంటాను. (వెళ్ళబోతాడు.)

పుల్ల : మాటలు కాదంఁయ్ తేల్చుకోటానికి. మందకి మంద రౌడీలను దింపాడక్కడ. వాళ్లు తాగి కర్రలు, కత్తులు తిప్పు తున్నారు.

జాన : విన్నావా, మోహన్ ?

మోహ : ఆయన యేపనిచేసినా వొక ప్లానుప్రకారం చేస్తున్నాడు.

జాన : ఇది నీవు మొదటినుంచి చెపుతూనే వున్నావు. సరే, ఇప్పు డేఁవిటి మార్గం ?

మోహ : అందరం కలసి ఎదిరించడమే.

జాన : రైతులంతా కలసివస్తారనుకో. మరి కూలీలు !

పుల్ల : కూలీల కేం వాగారిందండి. పావలాకూలి పెంచమంటే కాదూ, గూడదన్నారు.

సూర : నిజమే, మరి అప్పటి కది ప్రేణం ఒప్పలా !

రామ : దాని దేంటిలే, యేటా పుట్టకు పుట్టు పండే పొలం ఈ యేడు గిద్దెడుగింజలు పండదుమరి.

పుల్ల : ఇప్పుడు సమ్మగావుంది.

సూర : అప్పుడు యింత కత జరుగుతుందనుకోలా !

జాన : అదిగాదు సూరయ్యా ! ఆనాడు కూలి పెరగకపోవ టానికి కారణం గోపాలరావే. ఆయన కల్లబొల్లి కబుర్లు నమ్మి, ఆయన చంకకింద దూరాం.

సూర : దూరబట్టే, యిప్పుడుదాకా బొమ్మలాడించాడు.

మోహ : తవ్వి తలకెత్తుతానని రైతుల్ని నమ్మించాడు. రైతులకూ, కూలీలకూ మధ్య గండికొట్టాడు. తుదకా రైతులకే ద్రోహం తలపెట్టా డీ గోపాలరావు. తమ నిజమైన శత్రువు ఎవరో యిప్పుడు అర్థమవుతుంది మనవాళ్ళకు.

(చంద్రయ్య తెరలోపలనుంచి బిగ్గరగా "ఒరేయ్ గిత్తలు, గిత్తలు, పోయె, పోయె, పోయె అరెరెరె తోట, తోట" అంటూవస్తాడు. అక్కడవున్న వారంతా ఆయనవంక దీనంగా చూస్తూవుంటారు. చంద్రయ్య వారిని వెర్రిగా చూస్తూ తో...తో...ట...తో...ట...గి...త్త...లు. అంటూ, వరుసగా పుల్లయ్య, రామదాసు, సూరయ్యల వద్దకు వెళ్లి వాళ్ళ ముఖాల్లోకి చూస్తాడు. చివరకు జానయ్య వద్దకు వెళ్లి)

చంద్ర : ఎవరు నువ్వు! (జానయ్య ఎలా తెలా పోతూ వుంటాడు.) మాట్లాడవేం ?

సూర : (చంద్రయ్య దగ్గరకు వస్తూ) ఎవరూ లేరు లేరా అన్నయ్యా, వెళదాం. (చెయ్యి పట్టుకుంటాడు.)

చంద్ర : (చెయ్యి విదిలించుకొని పిచ్చిగా) ఎవరూ లేరూ! ఎవరూ లేరూ, లేకపోవటమేంటి ఈళ్ళంతా మనుషులుగాదూ? నా కళ్లు కప్పుతారా, వుండారు, వుండారు. ఏం లాభం. అంతా అయిపోయింది. అయిపోయింది,

రాము : (విచారంగా) ఇదిగో బాబూ! నేనేంటి ?

చంద్ర : ఎవరు ! రామదాసా ! అహ్హాహ్హా, రామదాసు, రామదాసు (నవ్వి) గుడి గట్టిచ్చావా ! గుడికట్టిచ్చద్దే రామదాసు వెట్టా అవుతా ! నువ్వు కట్టిచ్చలేదుగా. లేదు, లేదు. (రెండడుగులు వేసి) ఉండు, ఉండు, ఉండు, ఉండు. (అంటూ జేబులోని పిచ్చికాగితాలు తీసి) ఇవిగో రామ్ములగపళ్లు, రామ్ములగ పళ్ళు, (ఇస్తూ నవ్వుతాడు. తరువాత పుల్లయ్యవద్దకు వెళుతూ) కాదు, కాదు, పుల్లయ్యా, పుల్లయ్యా, పూలు, పూలు తీసుకెళ్ళి అమ్మాయికియ్యి. నే నిచ్చానని చెప్పేం. (పుల్లయ్య దీనంగా తలవూపుతూ పిచ్చికాగితాలు తీసుకుంటాడు) ఇదిగో సూరయ్యా ! పొద్దెక్కిందిగాని తోటకాడికెల్దాం, పద.

సూర : తోటాలేదు పాడూలేదు, పదన్నయ్యా.

చంద్ర : లేదూ, లేదూ, తోటలేదూ, లేదు, లేదు. మింగేశాడు, ఆడు మింగేశాడు. నాది తోట, నాది తోట. (అంటూ రచ్చ బండపై కెక్కి అటూ ఇటూ తిరుగుతూ, జానయ్య తిన్నగా ఆగి, బిగ్గరగా) పో డు గొ ట్టి ం ది నేను, దున్నింది నేను, మొక్కనాటింది నేను. నీరుపోసింది నేను. పెంచింది

నేను. పెద్ద జేసింది నేను. నాదా! నీదా! తోట.
నాదా, నీదా!

జాన : నీదే బాబూ !

చంద్ర : హ్హా హ్హా హ్హా నాదె...నాదె...నాది తోట. తోట నాదె. ఎవడొస్తాడో రమ్మను. రమ్మను ఎవడొస్తాడో. తోట్లో అడుగు పెట్టమను చెప్తతా. ఆ, ఉ, ఉ. (అంటూ రచ్చబండమీద సర్దుకుని కూర్చుంటాడు).

నిర్మ : (ప్రవేశించి) ఇక్కడ వున్నావా నాన్నా ! నీ కోసం అదంతా తిరిగాను.

రామ : తీసుకుపదమ్మా మా మాట వినడంలేదు.

నిర్మ : రాత్రి అన్నంలేదు తాతా! తెల్లవారికూడా ఇంత వరకు పచ్చిగంగ ముట్టలేదు. ఏం చెయ్యాలో తోచడంలా. (తండ్రివద్దకు వెళుతూ వుంటుంది.)

రామ : మరీ పై త్యాన పడ్డట్టుంది. తొందరగా తీసుకెళ్ళి కాసిని మజ్జిగనీళ్ళు తాగించమ్మా.

నిర్మ : (తండ్రివద్దకు వెళ్ళి) నాన్నా ! (చెయ్యి పట్టుకుంటుంది.)

చంద్ర : ఎవర్రా నువ్వు. నా తోట్లో కాలు పెడతానికి (అంటూ నిర్మల చెంపమీద ఛెళ్ళున కొడతాడు.)

నిర్మ : నాన్నా! (కళ్లు చెమ్మగిల్లుతాయి.)

చంద్ర : (కుమార్తె ముఖాన్ని చూస్తూ క్రమంగా గుర్తించి, నిలువున కుంగిపోయి) అమ్మా ! (ఆవురుమని వెర్రికేకపెట్టి కుమార్తెను కౌగలించుకుంటాడు.)

నిర్మ : (కళ్ళనీళ్లు తుడుచుకుంటూ) ఏం లేదు నాన్నా, వెళదాం రా! (అంటూ చంద్రయ్యను చెయ్యిపట్టుకుని తీసుకువెళుతూవుంటుంది. చంద్రయ్య మాట్లాడాకుండ నిర్మలను అనుసరిస్తాడు.)

జాన : పాపం, ఎట్లాంటి మనిషి ఎట్లాంటి స్థితికి వచ్చాడు. ఈ తండ్రీ బిడ్డల వుసురు వాడికి తగలకుండా వుంటుందా.

నిర్మ : ఉసురు, ఎవరికి ఉసురు. మీరంతా చేతులు ముడుచుకు కూర్చోండి. ఆయన ఎవరి ఉసురో తగిలి పోతాడు. గోపాల రావు దురాగతాలకు గురయింది మేమే కాదు. ఎన్నో కుటుంబాలు నాశనమైపోయిన్నై. ఇంకెన్ని కావాలో. ఇప్పటికైనా కళ్లు తెరవండి. (తండ్రిని తీసుకుని వెళ్లిపోతుంది.)

మోహ : (జానయ్యతో) ఇంతంత ఘోరాలు జరుగుతూవుంటె మీబోటివారు చూస్తూ వూరుకోవడం ...

జాన : ఏమీ చెయ్యలేకనే వూరుకునేది. గోపాలరావు సంగతి నీకూ తెలుసుగా. నోరు తెరచినవాడినల్లా పాతాళానికి తొక్కుతూవుంటాడు.

మోహ : అవును, ఒకరిని పాతాళానికి తొక్కుతూవుంటె, మిగతావారు చూస్తూ వూరుకోబట్టే, యీ గోపాలరావు ఆటలు సాగిన్నై.

జాన : నే నొక్కణ్ణే వూనుకుంటె యేమవుతుంది ?

రామ : మీ రొక్కరేంటి ? మే మంతా లేం. ఊఁ, అంటే పల్లె అంతా కదిలిరాదూ.

పుల్ల : కదిలిరావట మేంటి ! ఆయన దొంగ్గో దూన్గాడదీసే దిక్కుకూడ వుండదు.

సూర : ఊళ్లోవున్న చాకలి, మంగలి అంతా సిద్ధమే. ఆ పూచీ మాది.

మోహ : ఇవ్వాళ గోపాలరావు వేయించిన అడ్డీ ప్రతిరైతు మెడమీద ఒక గండకత్తెర; శంకరయ్యగారిలాంటి ఒకరిద్దరు తప్ప, మిగతా రైతులంతా కలసివస్తారు.

జాన : సరే, కానివ్వండి. మోహన్ ! ఆ చందాలు ఎప్పుడు వసూలౌతయ్యో ఏమో! డబ్బు నేనిస్తాను. ముందు చంద్రయ్యగారి గిత్తల్ని ఇవతలకు తోలుకురండి.

రామ : ఆ గిత్తల్ని కళ్ళచూస్తే మళ్ళీ ఎప్పుడు మనిషి అవుతాడు.

సూర : అసలీమాట వింటే ఆయన ప్రేణం లేచిరాదూ !

పుల్ల : (వింగులోకి చూచి) అదుగడుగో, వస్తున్నాడు దొర అడ్డీ వేయించి.

జాన :
సూర : } సరే, రానియ్.

మోహ : ముందు మీరుమాత్రం తొందరపడకండి.

(గోపాలరావు ఒకవైపునుండి వస్తాడు. కనకమ్మ నీళ్ళబిందెతో రెండవ వైపునుంచి అతనికి ఎదురుగా వస్తుంది.)

కనక : (గోపాలరావును తప్పుకుంటూ) పోయేనాడు కట్టుకుపోతాడు. ఈడి పొంగు బొగ్గులుగాను. (అంటూ వెళ్ళిపోతుంది.)

గోపా : (ఆ మాటలకు మనస్సు చివుక్కుమంది. కోపంకూడ వచ్చింది. కాని సంబాళించుకుని) ఎవర్ని , ఏఁవిటి ?

సూర : ఆఁ, ఆకాశరామన్నని. ఎవరినంటే మొన రూరుకుం టారు, నన్నే.

గోపా : ఎవరినైతేమాత్రం ?

సూర : ఏం చేస్తాం, నన్ను కాదన్నట్టు వూరుకుంటేసరి. అయ్యేపోతయ్ గాలికి.

(గోపాలరావు వెళుతూవుంటాడు.)

జాన : వెళుతున్నారా?

గోపా : ఎందుకు?

జాన : మన కాలువకింద సాగయ్యేది ఎగువనుంచా? దిగువ నుంచా?

రామ : ఆ కాలవ పుట్టినకాడనుంచీ దిగువసాగే.

సూర : దిగువ సాగయితే, గోపాలరావుగారు యెగువనెందుకు వేయిస్తారు అక్కడ?

మోహ : ఆయనకు తెలిసివుండదులే. బహుశా జీతగాళ్లు వేసివుంటారు.

గోపా : వేస్తే వేశారేమో.

జాన : రాడీమూకనుకూడా వాళ్ళేదించారా? ఊహుఁ, కందకు లేని దురద చామకు పట్టిందన్నమాట.

గోపా : పట్టింది, పట్టలేదు. ఇప్పుడేమంటావ్?

జాన : మామూలుగా కాలువదిగువకు వెళ్లాలి. అక్కడనుంచి పొలం తడుస్తూ రావాలి. ఇది అనాదినుంచీ రైతులకున్న హక్కు.

గోపా : హక్కు! హక్కులు, ఆచారాలు యెన్నిమారి పోతున్నై. అట్లాగే యిదీని. ఏం, మోహన్! పూర్వం నుంచి వున్న ఆచారాలన్నీ మారాలని ప్రచారంచేసేది నువ్వేగా.

మోహ : పూర్వాచారాలన్నీ మారాలని నేనేగాదు. ఎవ్వరూ అనరు. మంచిని తీసుకుంటాం. చెడువుంటే కాదంటాం.

గోపా : ప్రతి సంవత్సరం దిగువనుంచి సాగు జరుగుతుంటే, యెగువ రైతులు మట్టిగొట్టుకు పోతున్నారు.

సూర : పాపం, మీరూ, శంకరయ్యగారూనా ?

గోపా : ఏం, మేం రైతులంగాదా ! అవన్నీ ఆలోచించే యీ పనిచేశాం. ఒక సంవత్సరం ఎగువనుంచి, ఒక సంవత్సరం దిగువనుంచి. ఎవరికీ నష్టం వుండదు.

జాన : ఎందు కుండదు ? ఎగువ పొలమంతా మీది, శంకరయ్య గారిది. అదంతా తడిసి, కాలువ దిగువకి వచ్చేసరికి నడి వానాకాలం వస్తుంది. నాట్లు అయ్యీ అవక ముందే ములక పట్టిందంటే, చేసిన కష్టమంతా యేటిపాలవుతుంది. ముంజేత నాటుపడితే నాలుగు కర్రలుచేసి, వాన వచ్చినా, వరద వచ్చినా కాస్త తట్టుకుంటుంది. మీ ఇద్దరిది మెరక పొలం గనుక ముంపు భయం లేనేలేదు.

మోహ : ఏమండీ గోపాలరావుగారూ ! మీరూ, శంకరయ్య గారూ నిర్ణయిస్తే సరిపోతుందా . మిగతా రైతుల ఇష్టా యిష్టాలతో పనిలేదా. ఇది న్యాయమా ?

గోపా : మాకు తోచిన న్యాయమది, కాదనుకొంటే ఈ సారి చూద్దాం.

జాన : (తీవ్రంగా) ఈ సారి చూద్దామేగాని ఇప్పుడు అడ్డే తియ్య వన్నమాట !

సూర . తియ్యటాని కేనా వేసింది.

గోపా : ఏంవిటోయ్, మహా వెటకారంగా మాట్లాడుతున్నావ్.

మోహా : ఏంవిటండీ, వెటకారం. తియ్యి తియ్యని కబుర్లు చెప్పి యేదోవిధంగా ఈ ఏడు అడ్డీని కాపాడుకుంటారు. తరువాత మాకూ హక్కుందని బుకాయిస్తారు. ఇదేగా మీప్లాను?

సూర : అబ్బె ! అదెందుకయింది ! దొంగలు దొంగలు కలిసి వూళ్ళు పంచుకుందామనుకున్నారు.

గోపా : మేం దొంగలం, మీరంతా దొరలు. సరే, కానివ్వండి అదీ చూస్తాను.

జాన : ఇంతకూ అడ్డీ తియ్యవన్నమాట ?

గోపా : అంత నిక్కచ్చిగా మాట్లాడితే తియ్యనే తియ్యను. దానిమీద పచ్చగడ్డి మొలవవలసిందే.

జాన : ఆ అడ్డీ తియ్యకపోతే నాపేరు జానయ్యేకాదు.

గోపా : చెత్తాకానీరకమంతా చుట్టూ చేరేటప్పటికి నీకూ తల ముదిరినట్లుంది. రండి అడ్డీ దగ్గరకి, పాతిపెట్టిస్తాను.

మోహా : మీరు బుద్ధిపూర్వకంగా తీస్తారని మేమెప్పుడూ అనుకోలేదు. మీకు ధనబలం వుందనుకుంటున్నారేమో ! మాకు వుండాల్సినబలం మాకూ వుంది. మీ తుపాకులు, లాఠీలు, రౌడీలను చూపి గ్రామాల న్నణచాలని కలలు కంటున్నారేమో, ఆ కాలం దాటిపోయింది.

గోపా : గ్రామం! రేపీపాటికి గ్రామాన్ని ధ్వంసం చేయిస్తాను. ఖబర్దార్!

సూర :
పుల్ల : } అబ్బో ! (పెద్దగా అరుస్తారు)

గోపా : (బిగ్గరగా) ఊం.

జాన : (మరింత బిగ్గరగా) ఊం!

(గోపాలరావు వెళ్లిపోతాడు. తరువాత ఒక రౌక్కారే ఆవేశంగా)

సూర : ఇవ్వాళ తేలిపోవాలి వీడి బతుకు, మన బతుకు.
జాన : దేవు డడ్డంవచ్చినా అడ్డీ పగలదీసితీరాల్సిందే.
రామ : నేనూ, ముందు నుంచునేది.
పుల్ల : ఇవ్వాళ చస్తే రేపటికి రెండు.
మోహ : పదండి స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు బారులుదీర్చి నడవండి. విజయం మనదే. జై ఆంధ్ర మాతకీ. (అంతా జై అంటారు.)

( పాట )

బిరబిర లెండోయ్ – ముందుకు రండోయ్
వీరయోధులారా – వీరయోధులార ॥బిర॥
కదలి ముందునకు స్త్రీలూ పురుషులు
కదనరంగమున దూకండోయ్ ॥బిర॥
ప్రజాబలంబుల ధాటినాపగ
బ్రహ్మాతరము గాదోయ్
గర్జించుచు యువ్వెత్తున లేచిన
కడలి పొంగు నరికట్టె దెవడోయ్ ॥బిర॥
నిరంకుశత్వ మదెట్టిదైనను
నిలువదు ఈ జగతి
దమననీతిని దారుణహింసను
దగ్ధము సేయగ రారండోయ్.
లెండోయ్
రండోయ్
లెండోయ్.

( తెర )



# భూమికోసం

## ఎనిమిదో రంగం

( తోట )

(చంద్రయ్య యింటిముందు ఆకులు, కుండ పెంకులు, చెత్తా చెదారం అంతా చికాకుగా వుంటుంది.)

ముచ్చెమటలతో సూరయ్య, పుల్లయ్య ప్రవేశిస్తారు. పుల్లయ్య ముఖాన చిల్లిపడి నెత్తురు కారుతుంటుంది. కర్రలు ఆర్డరులో వుంచుకొని నలు దిక్కులూ పరిశీలిస్తారు. సూరయ్య స్టాంట్జుద్వారా పుల్లయ్య యింట్లోకి వెళతాడు. సూరయ్య తోటలో వెదుకుతాడు. కాని ఎవరూ కనబడరు. వారు యింటిముందుకు వస్తారు.)

సూర : ఇక్కడా లేర్రా, గాడిదకొడుకులు.

పుల్ల : అబ్బ, దొరికినట్లయితేనా !

కనక : (కనకమ్మ, నిర్మల, రామదాసులు ప్రవేశించుతారు) ఒక్క సచ్చి నాడూ దొరకలేదా ?

సూర: దొర కెక్కడికి చస్తారు, ఏ గడ్డివాములో నక్కారో.

పుల్ల : ఎక్కడన్నా వుండనియ్. పట్టితీరాల్సిందే.

సూర : సరే పద. (ఇద్దరూ వింగువరకు వెళ్తారు. సూరయ్య వెనక్కి రెండడుగులు వేసి, కనకమ్మ, నిర్మలలవైపు చూస్తూ, రామదాసుతో) రామదాసూ !

రామ : నే నుండాగా బాబూ !

(సూరయ్య, పుల్లయ్యలు వింగులోనికి వెళతారు.)

కనక : (వీంగులోకి చూస్తూ) ఇదుగో ! జాగ్రత్త.

(రామదాసు నవ్వుకుంటాడు.)

నిర్మ : (తెగి పడియున్న తీగనందుకొని) ఎంత పనిచేశారు !...

కనక : నడమంతరపు సచ్చినాళ్లు. కాసేపూసే మొక్కల్ని తెంచేశారు. ఇయ్యేం జేసెనియ్యో. (చీపురు తీసుకుని వూడవడం ప్రారంభిస్తుంది. నిర్మల కుండ పెంకులు యేరుతూ వుంటుంది.)

రామ : (జారిపడివున్న తాటాకులను సూరులో దోపుతూ) ఆళ్ళ కేం టమ్మా రౌడీ ముండాకొడుకులు.

కనక : (వీంగులోకి చూచి) ఎవరో వస్తన్నారు.

(రామదాసు ముందుకు వెళ్ళి నిబ్బరంగా అటు చూస్తుంటాడు.)

కనక : (అటు చూచి) సరె సర్లే, అల్లుడు.

(మోహనరావు అలసటగా ప్రవేశిస్తాడు.)

కనక : (మోహనరావు ముఖం వైపు చూచి) అదేంటి నాయనా, మొఖాన బొప్పి !

మోహ : మరేం లేదు. అడ్డీదగ్గర రౌడీలు పారిపోతూ పారి పోతూ రాళ్ళు విసిరారు.

కనక : చేతగాని సచ్చినాళ్ళు.

మోహ : (నిర్మలవైపు చూచి) మంచినీళ్ళున్నయ్యా ?

నిర్మ : లేవు, తెస్తాను.

కనక : ఏం పెట్టి తెస్తావ్. కుండలుకూడ ఆళ్లేదాన పగులగొట్టు కుంటేను.

నిర్మ : నూతిదగ్గర బొక్కెన వుండాలి. (గబగబ వెళుతుంది.)

రామ : గోపాలరావుగారు నిజంగా నక్కనిచంపి పుట్టాడు.

కనక : మాయముండాకొడుకు !

రామ : అవునమ్మా, సమయానికి చిక్కకుండాపోయాడు.

మోహ : ఎక్కడికి పోతాడు తాతా, యిదంతా వదలిపెట్టి.

నిర్మ : (ఇంతలో నిర్మల బకెట్టుతో నీళ్లు తెచ్చి అందిస్తూ) ఎక్కడికైనా పోనీ, దొరక లేదుగా.

కనక : ఎందుకుండి ఏం లాభం. (లోపలికి వెళుతుంది.)

(మోహనరావు బకెట్టులోని నీళ్ళు దోసిలిలోనికి తీసుకొని త్రాగబోతాడు. ఇంతలో రెండవరౌడీ లోనికి రావటంచూచి కర్ర అందుకుని దెబ్బలాటకు సిద్ధమవుతాడు. నిర్మల కంగారుగా అటు తిరిగి చూస్తుంది. ముసలి పులిలా లేచి రామదాసు కర్ర సర్దుకుంటాడు.)

రౌడీ : (ప్రవేశించి, గజగజలాడుతూ) దణ్ణంబాబు, దణ్ణం. ఈ తప్పు కాయండి. (మోహనరావు కాళ్ళమీద పడతాడు.)

మోహ : (తీవ్రంగా రౌడీవైపు చూస్తూ) నీ విక్కడి కెందుకొచ్చావు? నీ వేనా యిం కెవరైనా వున్నారా ?

రౌడి : నే నొక్కడినే బాబు. నన్ను నమ్మండి. ఆ దొరమాటలు నమ్మి కరవమన్న గడ్డల్లా కరిశాం.

నిర్మ : ఇదంతా నాటకం. వీడి మాటలు నమ్మకండి.

రౌడి : లేదు తల్లి. ఏ ఒట్టుపడితే ఆ ఒట్టు.

నిర్మ : ఒట్టు, నీతి నియమాలు లేనివాడికి. (లోనికి వెళ్తుంది.)

రామ : పాపం పున్నెం ఎరుగని ఆ ముసలాయన్ని కొడతానికి మీ చేతు లెట్టా ఆడినియిరా.

రౌడి : నేను గాదు బాబు కొట్టింది, బండరాముడు.

మోహ : వా డెక్కడ.

రౌడి : వాడా బాబు.

మోహ : ఆఁ.

రాడి : వాడా.

మోహ : ఆఁ, వాడే.

రాడి : ఆ వాగొడ్డుతుమ్మల్లో.

మోహ : అక్కడ లేకపోతే.

రాడి : లేకపోతేనా ! నన్నేమైనా చెయ్యండి. ఒప్పుకుంటా.

(ఇంతలో బయటనుండి "నడవ్వేరా. నడువు. దిక్కులు చూస్తావేరా దొంగనాయాలా. నిన్ను పగలగోసినా పాపంలేదు; ముద్దుగాడిద కొడక" అంటూ సూరయ్య బండరాముడ్ని నాలుగుదెబ్బలు బాదుతాడు. "అమ్మో, బాబో, నన్ను చంపకండి దొరో. మీ కాళ్ళకు మొక్కుతాను దొరో" అని కేకలు బొబ్బలు పెడతాడు రాముడు. ఇద్దరూ లోనికి ప్రవేశిస్తారు. రాముడి పెడరెక్కలు కట్టివుంటై. "నడువ్వు, నడవరా" అంటూ సూరయ్య వాడ్ని పడనెడతాడు. ఆ త్రోపుతో వాడు మోహనరావు కాళ్ళమీద పడతాడు. పడిన వాణ్ణి జుట్టుపట్టుకుని నిలబెడతాడు సూరయ్య. వాడు గజగజలాడుతూ నిలబడతాడు.)

బండ : చంపబోకండి దొరా. దణ్ణం, దణ్ణం దొరా. మీ పాదాలకు మొక్కుతా.

సూర : నోరు ముయ్.

బండ : (గట్టిగా నోరు మూసుకుంటాడు.)

సూర : వాగొడ్డుతుమ్మల్లో నక్కాడు. గొడ్లకాడ పిల్లలు చూచి చెప్పారు.

మోహ : (రాముణ్ణి చూచి) సరె, మీ గొరెక్కడరా ?

బండ : దొరా ... కారేసుకుని ఎక్కడకో పోయారండి.

మోహ : ఎక్కడకు పోయాడు ?

బండ : బస్తీకి బాబు, బస్తీకి.

మోహ : బస్తీకి వెళితే అక్కడ నైపుగానే వెళ్ళాలి. మేమంతా అక్కడే వున్నాం. మాకు కనబడకుండా ఎలా వెడతావు, నిజంచెప్పు.

బండ : నిజం బాబూ. అందుకనే యిటు నడిందారిని తప్పు కున్నారండి.

సూర : అవును. ఆ పొల్లాన కారు పోయినజాడలుకూడా వుండవుు.

మోహ : అలాగా.

బండ : దాసుణ్ణి బాబూ, బుద్ధొచ్చింది. లెంపలేసుకుంటున్నా.

రామ : నీకా! ఊరు ఉత్తరాన జేర్చిన్నాడే నీకు బుద్ధొచ్చేది.

మోహ : మొదట్నించీ వీడి బ్రతుకింతే, నిజానికి వీణ్ణిం జేసినా పాపం లేదు.

రాము : బాబూ, బాబూ కాపాడండి పిల్లలుగలాణ్ణి.

మోహ : ఛీ, నోర్ముయ్ గాడిద.

(పుల్లయ్య ప్రవేశం)

పుల్ల : గాడిద గీడిద, నరక్క సూత్తారేంటి ? (అంటూ కర్ర పైకెత్తుతాడు.)

రాము : ("బాబూ, బాబూ" అంటూ ఒణుకుతాడు)

మోహ : పుల్లయ్యా ! (పుల్లయ్య ఆగిపోతాడు. సూరయ్యతో) సూరయ్యమాంవా వీడిసంగతి తరువాత ఆలోచిద్దాం; తీసుకెళ్ళి మన యింటిదగ్గర గదిలో పారెయ్యండి.

రాము : అంతే బాబూ.

సూర / పుల్లయ్య : ("నడవరా" అంటూ తన్నుకుంటూ తీసుకుపోతారు. వాడు "అమ్మో, బాబో" అని ఏడుస్తుంటాడు.)

మోహ : (రెండవ రౌడీతో) ఈ సారికి నిన్ను క్షమించి విడిచి పెడుతున్నాం. ఇకనైనా జాగ్రత్తగా బ్రతుకు, పో.

(రౌడీ నమస్కరిస్తూ వెళ్ళిపోతాడు. బయటనుంచి ఎద్దుల గంటల మోత, గిత్తలను రిక్కవేసి ఆపుతున్న ధ్వనికూడా వినబడుతుంది. బయటనుంచి చంద్రయ్య "అమ్మా అమ్మా" అంటూ ప్రవేశిస్తాడు. "నాన్నా" అంటూ నిర్మల లోపలనుంచి వస్తుంది. ఆమెతో కనకమ్మకూడ బయటికి వస్తుంది.)

చంద్ర : అమ్మా! మన గిత్తల్ని తోలుకొచ్చానమ్మా. రామదాసూ, రామదాసూ (మోహన్ వైపు చూస్తూ) బాబూ, బాబూ చూశారా. ఎట్టా చిక్కిపోయినయ్యో. ఉపూరు మంటున్నై. రామదాసూ ఉండు, ఉండు, మేతకోసెయ్యాలి. (చూరులో వున్న కొడవలి వెతికి తీసుకుని కుమార్తెదగ్గరకు వచ్చి) అమ్మా నల్లికప్పేసిపోయినై. కడగాలమ్మా.

నిర్మల : నేను కడుగుతాలే నాన్నా. (బకెట్టు తీసుకొంటుంది.)

చంద్ర : సరె, సర్లే. (అంటూ గబగబా నాలుగడుగులు వేసి ఆగి) కొడవలి, కొడవలి (తన చేతిలోవున్న కొడవలి చూసి నవ్వుతూ "వుందిలే, వుంది" అంటూ వెళతాడు. కనకమ్మ, నిర్మల ఆయన్ని అనుసరిస్తారు.)

(జానయ్య, శంకరయ్యలు ప్రవేశించుతారు)

మోహ : (జానయ్యతో) రండి, మీకు చాలా ప్రయాస గల్గించాం.

రామ : తొందరగానే వచ్చారే.

జాన : కోర్టులో డబ్బుకట్టి, గిత్తలదగ్గరికెళ్లాం రామదాసూ. అవి ముసలాయన్ని చూచి అడలుతూవుంటే నా గుండెలు కదిలిపోయినై అనుకో.

(సూరయ్య, పుల్లయ్య ప్రవేశిస్తారు. ఈసారి పుల్లయ్య ముఖాన కట్టు వుంటుంది.)

సూర : ఓహో, శంకరయ్యగారు దయచేశారే!

శంక : ఏం లేదు సూరయ్యా. జానయ్య, ముసలాయన బస్తీ నుంచి గిత్తల్ని తోలుకొస్తావుంటే దారిలో కలిశా. అక్కడ్నుంచి యిట్లా వచ్చా.

పుల్ల : అంతేగద.

సూర : మళ్లీ ఈయనగా రేం వారంటుతో దిగారో అని నాకు భయంవేసిందిరా పుల్లయ్యా!

శంక : ఇదిగో, సూరయ్యా! అసలు నేను ఎవరికీ అప్పు పెట్టనే పెట్టను. అయినా పెట్టటానికి నాదగ్గరేముండి సచ్చిందిలే.

పుల్ల : పాపం.

శంక : ఒకవేళ వంద, యాభై అప్పు పెట్టినా అయ్యా, బాబూ అని వసూలు చేసుకోటమే కాని, యిట్టా జప్తులు, గిస్తులు చేసే అలవాటు నాకు లేదు చూశావ్.

మోహ : మీ రిదంతా ఎందుకు జెపుతున్నారో బోధపడ్డంలా. గ్రామస్తు లందరితోపాటు కలిసిరమ్మని అడిగాం. మీరు తటస్థంగా వుంటామన్నారు, వున్నారు. మీ రలా వున్నందుకు మేం బాధపడ్డంలేదులెండి.

శంక : కాదురా అబ్బాయ్. ఎందుకుండానంటావే. ఒంటరిగాడ్ని. పెద్దముండాకొడుకుని. ఎటుబోతే ఏం చిక్కోనని అట్టావుండా.

సూర : అంతే లెండి. కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం. ఎందుకొచ్చిన బెడద, ఊం ...

శంక : నీతో వేగటం మాలావు కష్టంరా, సూరయ్యా.

( అంతా నవ్వుతారు. )

రామ : (పుల్లయ్య దగ్గరికెళ్ళి ముఖానవున్న కట్టు పరిశీలిస్తూ) ఇదేంటిరా పుల్లయ్యా, తలకు కట్టుకట్టావ్.

సూర : ఆడి సంగతి మనకు తెలవం దేముంది. మనం అడ్డిదగ్గర కెళ్ళేటప్పటికి రౌడీలు పారిపోవడం మొదలెట్టారా, కాస్త దూరం తరిమి అందరితోపాటు వెనక్కి తిరగ్గూడదూ, అదే పనిగా వాళ్ళవెంటబడ్డాడు. ఎవడో సన్నాసి ఆడి చావు తప్పించుకోటానికి కర్రిసిరితే, అది తగిలింది.

రామ : (పుల్లయ్యతో) సన్నాసి రాముడా, ఎటుబడితే అటేనా, గుడ్డెద్దు చేలోబడ్డట్టు.

పుల్ల : ఆఁ, ఎదవ దెబ్బ దానిదేంటిలేవే. సూరయ్యగారూ! ఆ రౌడీనాయాళ్లు మనం అడ్డిదగ్గిర కెళ్ళకుముందే ఎగడ్డారేంటి!

సూర : లేకపోతే చావటాని కొచ్చారనుకున్నావా, ఈ కిరాయి రకమంతా.

రామ : అదిరిపోయాను, మాటలా వూరు కూను కదిలొచ్చింది.

పుల్ల : కర్ర లేమైనయ్యో, కత్తు లేమైనయ్యో, తస్సాదియ్యా, తిన్న మాంసమేమైందో, సారా పీపాలేమైనయ్యో.

సూర : ఏ మనటమేంటిరా ! ఆ బిర్రుమీదేగా మన కంద కుండా వురికింది!

పుల్ల : (మోహన్‌తో) ఇంతకీ గోపాలరావుగారు బస్తీకి పారి పోయి బతికిపోయారు.

రామ : ఏం చేస్తాడు. చివరికి ఆయన వంటమనిషికూడా మనలోనే కలిస్తే ......

జాన : రంగయ్యకూడ అక్కడికే చేరాడు.

రామ : ఆయన కేం ప్రాణంమీదకొచ్చింది.

సూర : తనకీ దరువుబడుతుందని పోయాడేమోలే.

జాన : అదికాదు సూరయ్యా, జప్తు తాలూకు డబ్బు వడ్డీతో సహా కోర్టులో కట్టాంగా. తన డబ్బు తెచ్చుకుందామని అక్కడి కొచ్చాడు.

రామ : ఇచ్చాడా, మరి ?

జాన : ఇస్తాడూ ! నెత్తిన చెయ్యిపెట్టాడు. కోర్టుదగ్గర కనబడి రంగయ్య లబ్బున మొత్తుకున్నాడు. ఈపాటికి యిల్లు జేరుండాలి.

పుల్ల : బలేపని జరిగింది.

(సరోజ పరుగు పరుగున వస్తుంది.)

సరో : (ఆతురతగా) అన్నయ్యా (అంటూ వచ్చి కౌగిలించుకొంటుంది.)

(లోపలనుంచి కనకమ్మా, నిర్మలా వస్తారు.)

మోహ : ఎలా వచ్చావమ్మా ?

సరో : నాన్నే వెళ్ళమన్నాడు.

కనక : జబ్బొదిలింది, మా రంగయ్యన్నకి.

సరో : వదలటం గాదత్తయ్యా; మా నాన్నకు జబ్బుచేసింది. ముసుగుపెట్టుకుని పడుకున్నాడు. (అంటూ వాళ్లవద్దకు వెళుతుంది. నిర్మల, సరోజ తల నిమురుతూ వుంటుంది. అంతా నవ్వుతారు. సూరయ్యమాత్రం ఏడుపుముఖం పెట్టుకునివుంటాడు.)

జాన : (సూరయ్యవైపు చూచి) అదేంవిటి సూరయ్యా !

సూర : ఉండండీ, మా రంగయ్య బావ వెయ్యి రూపాయలు పేట్లో గలిసిపోయినై.

( అంతా నవ్వుతారు. )

రాము : కొడుకూ, కోడలూ ఇంటికెళ్లితే అన్ని జబ్బులూపోతయ్.

మోహ : ఈ గోపాలరావు ప్రక్కన జేరి మా నాన్న పెద్దవాణ్ణవుదామని కలలుగన్నాడు. ఫలితం, డబ్బుపోగా ప్రజలకు దూరమయ్యాడు. ఇలాంటి భూస్వాములను నమ్మినవారి గతులు ఎప్పుడూ యింతే.

జాన : ఇందరి కొంపలార్చి ఆ గోపాలరావుమాత్రం బాగుపడి చచ్చిందేముంది. పోయాడుగా వూరొదిలిపెట్టి.

శంక : అవును.

మోహ : అదే పొరపాటు. ఆయన బస్తీలో కూర్చొని మనల్ని సాధించడానికి చేయగల ప్రయత్నాలన్నీ చేస్తాడు. కోర్టు కీడుస్తాడు, కుట్రలు పన్ని గ్రామంలో చీలికలు తేవాలని ప్రయత్నిస్తాడు. ధనబలంతోను, తుపాకుల సహాయంతోను గ్రామాన్ని ధ్వంసంచేయడానికి పూనుకుంటాడు.

నిర్మ : మనం ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా మళ్లీ ఏదో ఒక ప్రమాదం తెచ్చిపెడతాడు.

రాము : నిజమేనమ్మా ! ఇకముందుకూడా రైతులు, కూలీలు ఇట్టాగే వుంటే.

జాన : తప్పకుండా వుందాం.

మోహ : అప్పుడు గోపాలరావే గాదు, మహేశశక్తీ మన ల్నెదిరించలేదు. ఇప్పటికి మనం ఒక విజయం సాధించాం.

ఇంకా సాధించవలసినవి అనేకం వున్నాయి. వెంటనే మనం బంజరు దున్నాలి. అసెంబ్లీలోకూడా దీనికి అనుకూలంగా తీర్మానం ప్యాసయింది.

పుల్లి :
సూర : } ఏమైనా సరే, బంజరు దున్నాల్సిందే.

శంక : ఇవ్వాళే దున్నుతారా ?

సూర : ఇప్పుడు.

శంక : దున్నుకోండి. దానిదేముంది. వెళతా ! కొద్దిగా పనుంది. (నాలుగడుగులువేసి వెనుదిరిగి) అబ్బాయ్, మోహనరావ్, ఈపూటే దున్నుతారా ?

మోహ : (నవ్వి) తప్పకుండా దున్నుతాం. కాని, యిదివరకు రైతులాక్రమించుకున్న బంజరుజోలికిమాత్రం వెళ్ళం. వెళ్ళిరండి.

సూర : శంకరయ్యగారూ! పదిమందితోపాటు మీరుకూడా...

శంక : ఆఁ, ఆఁ, అదా ... మా చిన్నగిత్తల్ని తోలుకెళ్ళండి. ( వెళతాడు )

సూర : సరే ! జానయ్యగారూ ! ఇప్పుడేవిఁటి ?

జాన : పదండి, మా నాగళ్ళన్నీ వస్తయ్. ఇదిగో సూరయ్యా, మా ఆవుగిత్తకు కాలు గొర్రుబడిందిగానీ, సుబ్బయ్యగారి శ్రీరాములు ఎద్దును తోలుకురా. మన దాపటిదాని జతకి.

సూర : ఏది, ఆ బట్టదాన్నా ? (అంటూ ముందుకు సాగుతాడు)

జాన : ఆఁ, గోపయ్యగారి దున్నల్నికూడా తోలుకురా !

సూర : తోలుకొస్తాలే . అరె పుల్లయ్యా ! పల్లెకుపోయి మనాళ్ళందర్నీ కొట్టుకురా.

పుల్లి : సర్లే. (గబగబ ముందుకు నడచి, ఆగి) ఇదిగో సూరయ్య గారూ! మీరొచ్చేటప్పుడు నాలుగు గొడ్డళ్ళుకూడా పట్టుకురండి.

సూర : సరె, మేము పట్టుకొస్తాంగానీ, నువ్వు పోరా !

(పుల్లయ్య వింగులోకి వెళతాడు.)

మోహ : (ముందుకు వచ్చి) ఇదిగో పుల్లయ్యా !

పుల్లి : ఆఁ.

మోహ : మనిషి బీరుపోకుండా పళ్లెకుపల్లె కదలిరావాలి సుమా!

పుల్లి: ఓఁ.

రామ : (ముందుకువస్తూ) ఒరేయ్, ఓరి పుల్లయ్యా !

పుల్లి: ఓయ్! నేనుగూడ వూళ్లోకిపోయివస్తాగాని, మా ముసలి దాన్నికూడా రమ్మను. బద్దకిత్తుందేమో !

( అంతా నవ్వుతారు. )

పుల్లి : (నవ్వుతూ) అట్టాగే.

కనక : (వెళ్లుతూవున్న పుల్లయ్య నుద్దేశించి) పెద్ద ముసలైదు. ఆమె రాకపోతే ఎట్టా ! నడవలేకపోతే ఎత్తుకన్నా తీసుకురండి.

( అందరూ నవ్వుతారు. )

రామ : (కనకమ్మ, నిర్మల, సరోజలతో) మరి మీరో ?

నిర్మల :<br>సరోజ : } మేమూ వస్తాం, తాతా.

మోహ : సరె, పదండి. (అందరూ వెళుతూవుంటారు.)

(ముందు పురుషులంతా వెళుతుంటారు. వెనుక రామదాసు నడుస్తూ,)

రామ : ఇత్తనాలు పట్రండమ్మో, ఇత్తనాలు.

చంద్ర: (ఎక్కడ్నుంచి వస్తూ) ఒరేయ్! నాదే ముందునాగలి.

(అంతా గ్రామంలోకి వెళతారు. తెరవెనుక పాట ప్రారంభమౌతుంది.)

పాట

రావోయి ఓ రాజ ఓ కూలి రాజా
వేవేగ రా రమ్మా రా, భానుతేజ
బంజరులు దున్నాలి పైరులే వెయ్యాలి ఆ...ఆ...ఆ
ఆనందంగా రైతు - హాలము చేతను బూని
నిలచె నిదె కాలూని - నీ కొరకు వేచెను ||రావోయి||

ఆహాహా...ఓ రమణీ జాగదేల సాగిరాగదె
బిరాన సాగిరాగదె
వేయవె ఈ భూమిపైన విత్తనాలను
చెలియ విత్తనాలను ఆ...ఆ...ఆ.........

అనుపమ ధీరా ఆంధ్ర కుమార
నిరాధారులంతా - నిర్భాగ్యజీవులంతా
జయనినాదములతో - విజయగీతములతో
భూమికోసమై - భుక్తికోసమై
కదలినాము నీ కరమందించుము ||అనుపమధీర||

("అనుపమధీర" అని పాడుతూ మోహన్ స్టేజిమీదకు వస్తాడు. అతని వెనుక పాటపాడుతూ రైతులు, కూలీలు వస్తారు. వారిదగ్గర వ్యవసాయ పరికరాలు, కూలీల దగ్గర తట్టలు, పారలు వుంటాయి. అందరికంటె వెనుక స్త్రీలు విత్తనాల బుట్టలతో వస్తారు. పాట పూర్తి అవుతూవుండగా అందరూ వరుసగ బంజరు దున్నటానికి వెళుతూవుంటారు.)

(తెర)

సమాప్తం.



